య్యనఁగనుమూసి కన్దెఱచునంతటిలో మునిసీమఁ జేరఁగన్. 58

క. అరుగఁ దదీయమనస్సర, దరవింద మరందబృందమై మధురసుధా
చిరకంపమై యొకానొక, పరమానందంబు హృదయబంధం బొందన్. 59

సీ. మధ్యసంధ్యాస్నాన మౌనీంద్రలూన తాపసగంధపవనంబు భ్రమరివాఱె
నంబుపర్ణసమిత్కుశాయాతవటుజాత సమదనాదంబు మీసంబు దీఁటె
సవన ధూమాబ్దవీక్షణనటత్కేకికాంతావిలాసము తోడల్తట్టుకొనియె
నన్యోన్యవైరాసహామృగేంద్రమత్తవేదండ కేళికలు పంతములు వలికె
నీకరణిమున్నుగాఁ బరాకిడియె మౌని, యాశ్రమంబని తన్మార్గమభినుతింప
మోదమునఁ దేలి నృపమౌళి మోము చూడఁ, జనవుమైఁ జేరి నిజకేళిసచివుఁడనియె.

సీ. చలువలు నించు నచ్చపుమంచుఁ జిలికించు తేరాయఁ డెడ లేర్పఱించువాఁడు
గలభి గాకుండ వేల్పుల నొక్కనొక్కనిఁ గా ధనరాజు వెలినుండి యనుపువాఁడు
వారివారిప్రభుత్వతారతమ్య మెఱింగి గిరిశుండు బంతిసాగించువాఁడు
ప్రొద్దువోయెను జూచి భుజియింపుఁ డని దేవపతి యుపచారము ల్పలుకువాఁడు
తగినవారల వీక్షించి తమ్మిబోఁటి తోఁడు మాటికిఁ జవు లెచ్చరించువాఁడు
జనవరా ఖండలా యిందు సంయమీంద్ర కాండకృతమైన సత్రయాగంబులందు. 61

చ. మునివనిత ల్శచీముఖ తమోనిభవేణులకుం బతివ్రతా
జనతతిఁ దెల్పఁ జోఁబరవిచారము గావని వేల్పుటొజ్జజ
వ్యని మొగమద్దముం జొనుప వారలు నవ్వుదు రామె సిగ్గుపెం
పునఁ దలవంపఁ జందురుఁడు పొంగగ నిచ్చట యాగవేళలన్. 62

సీ. సాలీఁడు గాఁబోలు సమదవేదండంబు తెలినారచీరలు డులిచి తెచ్చుఁ
బనివాఁడు గాఁబోలుఁ బటుఘోణిపోతంబు బలుమోర నివ్వరి కలుపుదీయు
గొల్లఁడు గాఁబోలు భల్లూకపాకంబు మేలిజున్నుఁ బసిమేఁపి తెచ్చుఁ
జనవరి గాఁబోలు గొనబుఁ బ్రాయపు జింక యలరిపై పారుపత్యంబు జేయుఁ
గూలిగొను నొజ్జకాఁ బోలుఁ గోదమ చిలుక, తపసిబుడుతలగమికి వేదంబుసుడువు
సుసరముగఁ బారికాంక్షు లేజోలిలేక, జపతపంబులు సాగింప జనవరేణ్య. 63

చ. మునివరు లేగ వెంట మృగము ల్నదికిం జని యంతనంత మే
పున కటు నిల్చుచు న్నియమపూర్ణత వారు నిజాశ్రమాళికిం
జనినఁ దదార్ద్రబంధురవిశాలజటల్దరజీవకాంత వె
న్కొని చెవి బక్కరించి యుఱుకుం బొదకట్టినవెల్ల దాఁటుచున్. 64

ఉ. ఎండదినంబులం బడఁగ లించుక నీడఁగఁ బట్టి మానులం
గొండొక సేదదేర్చ ఫణికోటులఁ జేరి యిదేటికార్య మా
లెండ మఱేమి మే మిచటలేమె యటంచు మరల్చి చెల్వమై
నిండ మయూరిక ల్పికిలినిద్దపు టెక్కలవీచు నక్కడన్. 65

మహాస్రగ్ధర. జనవన్మౌనీంద్రవేదాక్షరయుత తతహస్తస్రువాజ్యాహుతిప్రో
ద్భవవహ్నిస్ఫారకీలాప్రకటితకరదీపప్రభ న్వత్తు రౌరా
హవిరగ్రాహూతు లింద్రాద్యమరు లననికై యాస ప్రేరేపఁగా విూఁ
దినపొంచ ద్ఛ్రమధూమస్థితులు నిబిడమై వృష్టి చీఁకట్లు గప్పన్. 66

క. వేలిమియగ్గి పొగల్దగు, వేలుపుడిగ్గియను సంగ వెలువడు నమరీ
జాలము తిన్ననిపెన్నెఱి, వాలుఁగురుల కగరుధూపవైఖరి యగుచున్. 67

చ. ఇనహరిణాంకరశ్మి కెడమీయని యవ్వనిఁ బంకజాకరం
బునఁ గవజక్కవ ల్విగవఁ బ్రొద్దులు గ్రుంకుట దెల్లనాఁటు
ల్గనమి జలాగవక్షి కులకాంతలమోమును కల్వరాయనిం
గనుఁగొని విచ్చిపోవుటయె గాని వియోగ మెఱుంగఁ డెన్నఁడున్. 68

చ. అని తెలుప న్మహీశుఁ డవుఁగా యని మెచ్చి పటాని తేజిడి
గ్గినతఁడి మూఁగి గచ్చు టరిగె త్తెలిపావడ వైచి యచ్చపుం
బని మగజాతిచెక్కడపుఁ బొనలు నిల్పిన వారలం గనుం
గొని యటు నిల్పి యాప్తులొకకొందఱు వెంటనెరా మునంబునన్. 69

క. చని నృపతి గనియె మునిజన, వనితాజనతానితాంతవర్ధితకేళీ
వనపాళీ కుసుమాళీ, జనితాళీనలినఘనము సంయమివసమున్. 70

క. కని పర్ణశాలప్రోలను, జని యచ్చటివారిచెంత సంయమిపతికిం
దనరాక తెలియఁ జేసి త, దనుమతిచే వేగఁ జని తదంతరసీమన్- 71

సీ. అచ్ఛపంతచ్ఛవి యామస్తకన్యస్తభసితాభఁ జేరి కేకిసలు గొట్టి
మోఘావిరుచి గండమిలదుదశ్మశ్రురుక్చయములఁ జప్పట్లు చఱచి నవ్వ
జడలఁ బర్విన డాలు శౌరిరధారాళి కాంతులఁ గికురించి కన్నుమూయఁ
బటునఖద్యుతి కరస్ఫటికాక్షమాలికా చ్ఛాయల డాసి కేకేయనంగ
నవ్యశార్దూలచర్మాసనంబుమీఁద, యోగపట్టె బిగించి కూర్చున్నవాని
గాలవుని గాంచి చేమున్న కట్టి మంత్రి, యందికొనఁ జేరి సాష్టాంగమాచరించి- 72

క. నిలిచినఁ గనుఁగొని నరవరు, కులపావన యిందువచ్చి కూర్చుండనవా

నిలిపితివి తండ్రిపగ్గులు, వెలసితి విటు లతనికన్న విక్రమ గరిమన్- 73

చ. అనుచు బహూకరించుసమయంబున నూరకయుండి యుండి యం
జనరుచి పుంజమంజిమకచగ్రహ మైనతమంబు పర్వె తో
డన హరిచందనప్రతిభటం బగువెన్నెల దోఁచె వెంటనే
కనఁబడియె న్నిరస్తకనకస్తబకస్తుతు లైన యొంపలున్- 74

క. అది చూచి మేదినీవర, భిదురీ మృదురీతిగా దభేద్యము గంటే
యిదిసుమ్ము దనుజశాంబరి, గదిసె న్బరిపూర్తి దీని ఖండింపు మిఁకన్- 75

గీ. విజయ మగు నీకు గెలువు మోవీరవర్య
యనుచు గాలవుఁ డాడుచో నచటఁ గలుగు
పారిగాంత్రులు కటకటం బడుచు శిష్యు
లంటి చనుదేర నచ్చోటి కరుగుదెంచి- 76

క. మునిచంద్ర వచ్చి మావెం, టనెవచ్చు నటంటి వీతఁడా నృపుఁడేమ
య్యా నరేంద్ర కన్నులారం, గనుఁగొంటివె వీని యవదగాకి తనంబుల్- 77

ఉ. అయ్యయొ మాకు పంపమిడినంతఫలంబు నరేంద్రచంద్ర యీ
దయ్యము తోడి జాగరము దాఁటఁగఁ జేసి శుభమ్ము లిమ్ము తే
వయ్య కౌమాళ్ళతండ్రి వయి యాశ్రితరక్షణ దుష్టశిక్షణా
క్షయ్యదయాపరాక్రమ విశాలుఁడవై మనుమయ్య యిమ్మహిన్- 78

సీ. చదువుకొన్నామంచు జట చెప్పుచుఁ బరీక్షఁగొని వరింపు మటంచుఁ బెనఁగువారు
ననుజూచె ననుజూచె ననుచు రిత్తకురిత్త జడలు వట్టుక పోరఁ దొడఁగువారు
బులకము లైమ్రనిట్టపాడువంగ వడి నోరు దెఱచి మైమైఁ జూడఁ దిరుగువారు
జేసన్న నటజంబు చెంతకు రమ్మని మును దొంగమొక్కులు మొక్కువారు
నగుదు రీయయ్యలెల్ల వాఁ డపరుగడగ, గులుకుగుబ్బలు పలుకుఁ జెక్కులు మిటారి
మొలకనవ్వులు గలమోము ముద్దుగులుక, మాయపుం డెక్కులాడి యై డాయునపుడు-

సీ. అటుమొన్న భార్గవజటికి శౌనకమౌని కొకవాదుమై నొంటుకుండఁ జేసె
మొన్నఁ బారాశర్యముని యోటరాఁ గూఁతలెగయించి వెరవేఁకి యెత్తఁ జేసె
నిన్న విశ్వామిత్రునికిఁ దంపరఘటించి యొడలెఱుంగక పడియుండఁ జేసె
నేఁడు మార్కండేయునికి సివంబెత్తించి తలవీడఁగ బయళ్ళ మెలఁగఁ జేసె
మానవాధీశ విను మింతమాత్రమైనఁ బ్రతుకవచ్చును వీనచేఁ బడినవాళ్ళ
కొల్లఁబాటయ్యె మాకునిందునికి యేమి, చెప్పెడిది మాతపంబు నీచేతి దింక- 80

ఉ. అన విని యంతయేమిటికి నానతి యిచ్చెద రిన్నినాళ్ళుఁ ద
ద్దనుజుని నొంచి మీపద ముదారముదాకృతి నొందఁ జేయఁగం
డినయది నాకు నేర మవునే కద యాకొదవ ల్సహించిన
న్ననుపుఁడు వానిఁబట్టి నుఱుమాడెద నొద్దికఁ జెల్లఁజేసెదన్- 81
ఉ. అనిన రిపుక్షయోస్తు విజయోస్తు పతేభవతే యటంచు వా
రనుపదు రాపకోప తరుణార్కవిభాదళితారుణాంబుజా
బనఁగను మోము కెంపుగఁ దవర్ధరణోన్ముఖభృంగయుగ్మప
జ్క్తినటనభ్రూకుటిక్రమము దెల్పఁగ నచ్చోటుఁ దర్లి నిల్చినన్- 82
సీ. అధిపభృత్య పరస్పరాన్వేషణాకారణప్రతివక్త్రృతన్నామకార్య
మననుగతస్వామి హయవేగభూరుహచ్ఛాయాసమాశ్రితచ్ఛాత్రకంబు
ధావనాయాసాస్వజీవనవృత్తి ధిగ్వాచకాందోళికావహజనంబు
సమ్మర్దబహుళశాది సరణికోభయపార్శ్వచారితవారణాధోరణంబు
సరయ సరదుష్ట్రినిష్ఠ్యూతజర్జరతధూర్త, గణ్యగాణిక్యసంభవత్కమనహాస్య
వారణక్షమతత్సుతాక్రూరదృష్టి, సంవృతాశంబు సైన్య మచ్చటికి వచ్చె- 83
క. ఈరీతి సైన్యమంతయుఁ, జేరిన నొకబయట రాజసింహము భటులం
దేరిజ వేయంబనిచి గు, డారము లెత్తించి యంతట ప్రవిగు్రింకన్- 84
గీ. పటపుటంగడి వీథులేర్పఱచి కొంచె, పాటి నడగని నెక్కి యాపాలె మెల్ల
విడియ నియమించి తిరిగె వేవేలు దివ్వె, టీలవెలుఁగున సంగీతమేలమమర- 85
చ. తిరిగి యతండు వచ్చి వడఁదేర్చుచు ఘుమ్మను వట్టివేళ్ళచ
ప్పరము కురంగటం దగు తుషారము చేరువఁ జారువజ్రపాం
డరరుచిగమ్మగుమ్మతగుడారమునం గొలువుండి పట్టణాం
తరమునుండి వచ్చునరనాథులకమ్మలు వించు నున్నెడన్- 86
గీ. ఊడిగపుటత్తికాఁ డొక్కఁడొయ్యఁగుఁ జేరి
విభుని చెవిలోన నేమేమొ విన్నవింప
నతని కనుసన్న గమఁగొని యయ్య మంచి
దతనిఁ బిలిపించెద నటంచు నఱిగివాఁడు. 87
సీ. నేసమై సగము దీసిన బూడెపండుతోఁ గూడినబంగారు లాడె సింగి
బారసీలిపిని జొప్పడ భగవద్గీత లెన్నిక వ్రాసిన చిన్నిపలక
బుడుత పసిమిరుచి పులితోలు చుట్టుతో బనసిక ల్పించిన పట్టుజోలె

యొకతిత్తి బరదేశుల కొసంగఁ గూర్చిన రసవాదపు మెఱుంగుఁ బసిఁడి బుడ్లు
కొండవలె నెత్తిపైఁ జుట్టుకొన్న జడలు, వెండికట్టులబెత్తంబు విడెమువీఁడ
వీడియముగల్గుదొర పాతలాఁడెజోగి, బిలికొని వచ్చి పొడఁగనిపించుటయును.

గీ. పతికరముఁజూప రత్నకంబళము మీఁదఁ, గడవసమునైచి కూర్చుండి బుడుతవీచు
సురటిగాడ్పుల నుదుటి కస్తూరి బొట్టు, రవలు రాలంగ నాతఁడా రాజుఁజూచి-

సీ. ఇది చేత నుండిన నిసుమంతవడిలోన నేదేశమునకైన నేగవచ్చు
నిది మోళి పైనున్న నెదుటి చేవెళ్ళిన వైరికైదువజాలి దారితప్పు
నిది దట్టిపొఱ నున్న నెటువంటిరూపైనఁ బ్రోపించి వేడుకఁ జూపవచ్చు

* * * * *

* * * * *

* * బపనికలొసంగి యొకమాయ పన్నుటయును.

ఉ. కంటెఁ దగిల్చినట్టికొన గల్గిన చందురుఁగావి జాలువా
జంట పయంటపై నిగుడి చక్కని జక్కవ నిక్కు చొక్కపుం
జంట చెలంగు బంగరువు చాయలు దూఁచియనంగఁ జాలు వా
ల్గంటి మెఱుంగుఁ జూపులు దళారనవచ్చె మహాద్భుతంబుగన్- 91

ఉ. చొక్కపుఁ బంజుకమ్మల రుచుల్మెఱుఁ గెక్కిన చెక్కుజాలువా
నక్కలచక్కజక్కిణిగొనం బిగిగుబ్బలు పిక్కటిల్లఁగాఁ
జుక్కలరాచడాలు తెలిచూపులు త్రొక్కనిచోట్లు ద్రిక్కనా
చక్కెరబొమ్మయమ్మహిపచంద్రుని చక్కటికేగి గ్రక్కనన్- 92

ఉ. రంగు చెలంగ గుబ్బల ధరాస్థలివత్సము మోపలేమి సా
ష్టాంగ మొనర్ప సిగ్గువడె నంచు నభంగురపాకభిన్మణీ
సంగతకంకణారవముచాటఁగఁ బైటచెఱంగు కేలితో
ముంగలఁ గొంకుచుం గొలువు మొక్కుఘటించి పిఱుంది కేగినన్- 93

సీ. సయిదోడ చూడు నస్సాయ యిల్లేజ యిల్లేశవోజులపతి యింగిలయ్య
* జగ్గుమంటివి వచ్చిశాణ నిద్దాహుంత్త కారి బుర్నాపుత్త గాలిసుమ్మ
అట్టెచూస్తుండది యదెనన్నె మోసిలి గలవాఁడ నని యదిగాక గడేని
చిక్కారిసాదన జేసెనదియింన్న దొభాజలల్ల మెలుద్రిబజారి

---

* యీపద్యమును బ్రత్యంతరములేకపోవుటచే నిచ్చవచ్చినట్లు దిద్దినఁ గవిహృదయము చెడునని భీతిచే నాభారముఁ జదువరులకే వదలినాము.

దీనిపైయేతుసై సేసి నానువాని, చిక్కటారికోలారికచిస్తిరోలి
రాజాపాలానవిను యిటురాయటంచు, రాచదేవళ్ళు కెరలి విరాళిగొనిరి. 94
గీ. అంత వారెల్లఁ బత్కారణాభినూత, నాతివాచాటతాజ్యప్రభూతరోష
వీతిహోత్రసముజ్జాతధూతికీలి, కాత్రుతిస్ఫీతతామ్రాత్ములగుచు లేచి- 95
సీ. ఒఱలతోడుత దట్టిపారల వంకులు డుస్సి తెలిచల్లడములతో నిలుచువారు
నింటి కిమ్మని పిల్లబంటుచేతికి సొమ్ము లొసఁగి వీరావేశమొందువారు
జౌనన్నఁ జేవెళ్ళ మని హెచ్చరించుచుఁ జికటారి పొపలికి తేసయువారు
దీని ముందరనొంచి వానిపైఁ బడువారు * * *
వాలు గొని లేచివచ్చు భూపాలుఁ ద్రోచి
యవ్వలి గుడారమున కేగుఁడనుచుఁ జెనకి
యతనిగద్దింపులకు భయమందువారు
నగుచు నంపఱు దొమ్మిగా నరయుటయును. 96
గీ. అంత నాలాడెజోగి మాయావిధిజ్ఞ, పంచమంతయు నుపసంహరించి నిలిచి
మునుపుఁ గొలువున్నవేళ నేయునికినూడి, రట్లయుండఁగఁ జైవార మాచరించి- 97
క. పాతాళకేతుఁ డంపిన, దూతన్నాసామికెదిరి దురమున నిలువ
న్నీతరముగాదు వినునీ, వే తెంచి బలంబుతోడ నిటు విడియుటయున్- 98
మ. తనచారుల్గని వచ్చి దైన్యమున నేతద్వార్త విన్పింపఁగా
విని మీసంబులుదిద్ది దైత్యుఁడహహా వీరా వడిన్వచ్చిపో
రనునన్నుం గది యించువారు మఱివారా నన్ను మార్కొంచురం
చనుమానింపకవచ్చి నిల్వఁగల వీరాగ్రేసరు ల్బాపురే! 99
క. పెంపు విచారింపక విని, పింపఁగరాదనక వచ్చి ప్రేలెదు వీరిం
జెంపలు వేయరె యనుచు ని, లింపారి నిజాప్తులం బిలిచి యిట్లనియెన్- 100
ఉ. వింటిరె యొక్కవార్త మనవెఱ్ఱులు చెప్పిరి తాముకన్నులం
గంటి మటంచు నీతబిసిగాంద్రుడు మదీయమహోగ్రమాయకై
దంటతనంబునంజని ఋతధ్వజు సైన్యసమేతుఁ జేర నా
బంటుఁ దనంబుఁ బాపుటకుఁ బన్నినవాఁ డట వాఁడు వాఁడిమిన్- 101
సీ. గరళకంఠద్వేషి కరకకాయలు గొన్ని తినియైన నాఁకలి దెచ్చుకొనుమ
దేవేంద్రమదభేది తెలివాయ గ్లలకోర పంటిమొన ల్సానఁ బట్టుకొమ్ము

ధూమ్రబర్బరకేశ తుప్పవట్టినఘోరజిహ్వ మిక్కిలివాఁడి చేసికొమ్ము
కుటిలాక్ష మాంసంబు గొంతునఁ బడినోరు దెఱన విప్పుము సిగ్గు దెచ్చుకొమ్ము
తవవులకుఁ గర్తె మనుజయూథప్రచండ, పలలపారణ తద్రక్తపానకేళి
లాలసామోద మీసుమాళంబు మీఁద, నరుసకంపము గంతులుసైపుఁ డింక 102

క. అని నన్నుఁ బనుప వచ్చితి, మనుజేశ్వర చాయవెట్టుమా రాజుల ని
న్వాని తూర్పుదెసను మాదొర, చనుదెంచు న్యాగ్నవహాన సన్నాహనమునన్- 104

గీ. అనినఁ జెలువవ్వ నవ్వి యజ్ఞవరాగ్ర, గణ్యుఁ డతనికిఁ గట్టునర్గం బొసంగి
మంచిపటువలె సేనడిపించు కొంప, మంచు వీడ్కొల్ప నాశైత్యుఁడరుగుటయును-

గీ. అధిపతియుఁ జల్వలుధరించి యారగించి, హితజనులు గొల్వఁ దగువారి యిండ్లకెల్ల
గేలిగతి నేగి యిది వేళ కీతిఁజూమాట, వాసులకటంచు లాలించి వచ్చెనంత- 105

సీ. బొంగులు నిల్పియుబ్బగఁ బైఁడిబ్రాఁత బొమ్మలగుడారంబు లమర్చువారుఁ
గొయ్యలు నాఁటి యాకులతోడి కెమ్మలు వాటంపు గుడిసెలు వైచువారుఁ
బొక్కళ్ళవలెఁ గుంతములు చెక్కి యామీఁద గడితంపుఁ బచ్చడాల్గప్పువారుఁ
బచ్చికల్పెక్కుడుపాఱలఁ జెక్కి పూబొదరిండ్ల మున్నుగాఁ గదియువారు
నచ్చుఁగ నీటికంమువలరయువారుఁ, పురుఁగుఁబుట్రలు చెదర నుబ్బుచును నొక్క
పరిగ నవ్వుచుఁ జప్పట్లు చఱచువారు, నైరి తద్వేళఁ బాళెంబువారలెల్ల- 107

సీ. రాతిరి పొక్కళ్ళ రాలుకొల్పిన వహ్నిగలిగినపొగలు చీఁకట్లు గప్పె
గాశ్పులచే నూఁదకయ బగ్గుమను శిఖుల్నిగుడుచోటులు పట్టపగలుచేసెఁ
దగవార్చి మూకుళ్ళ దిగువాఱనుంచిన కూటిబల్తావు లాగుబ్బుకొనియెఁ
బొరలించి చంద్రప్రనిప్పులమీఁదఁ గాల్చిన కఱకుట్లవాసనల్గ్రమ్ముకొనియెఁ
ద్రోవఁ బోనీక బల్లెపుల్ ఉవ్విలెత్చి, కడిగి జింకలవ్రేలాడఁ గట్టి తిత్తు
లొలుమ భీభత్సరసము మహోగ్రమయ్యె, భుక్తిగొన్నట్టివారి త్రేఁపులుపొసంగ-

క. చాలఁ గురంగటిమదు గుల, గాలాపుస్వేఁటలాడఁగా దొరకినబ
ల్లీలు చవిఁదేల్చె నపుడా, పాలెంబున డిగిన బక్కబంట్రౌతులకున్- 108

సీ. వలసినయెడకుఁ గమ్మలుబ్రాయు బ్రాయసంబులవారి గంటాల కిలకిలలును
దొరపలంగిన కార్యసరణు లెంచు నమాత్యకుంజరంబు లొనర్చు గుసగుసలును
బొలదిండి రాయల యలవుల గనివచ్చి సలుదు వేగులవారి కలకలములు
వనుప కంపఱటంచు వంతులేర్పడియున్న బలకరంబులవారి యుబ్బలములు
నెపుడు వెడలు నొకోయంచు నెంచి యాడఁ

జూచు సంగీతమేళంబు సొగసుకాండ్రి
ధిమ్మనెడి మద్దెలలమ్రోత గ్రమ్ముకొనియె
రాజు పవళించు తెలిగుడారంబుమ్రోల- 109

చ. నలుఁగిడి చల్వదాల్చి పయనంపు టలంతల నిద్రఁ జెందరో
వెలఁదులలేపఁ గొంకి పతివింతగుడారపు పారివారిగం
టలరొద కుల్కి లేవఁ జిఱునవ్వులతోఁ దమవారిఁ గూడి యిం
పులతమి దీఱినన్ నిదురవోయిరి నన్నుబోఁజుంగు లత్తఱిన్- 110

చ. గుమిగొని తెచ్చికోలుకుసిగుంపులఁ జెట్టులనీడఁ బొట్టిమం
చములపయి న్శయించి పటసారకుటీరము లెత్తి మేలిజా
నమున రమించు పల్లవులనంటున నేరములెన్నుచున్నృప
ప్రమదల మ్రోల నీటుసెఱపం బనిపూనిరి గుత్తలంజియల్. 111

చ. కనుకని తెల్లవాఱుపనుక గ్రతిగోరెడు పల్లవాళి మే
ల్గనుఁగొని వీడెముంగలుపులాహిరిమేపుల నిద్రఁబుచ్చి చెం
దిన చిఱునవ్వుతో నపుడె నిద్దురలాయని వింతపైఁడి ప
ట్టిన వెలముద్దుగుమ్మలు వడిన్శయనించిరి చప్పరంబులన్. 112

క. అల పాళెమునకు నిలుపని, బలకరమై పారివారిపరిమై తగును
కక్కాళమై నిదురించని సరి వలపుల వెలచెలుల విటులవతిఁలు టమరెన్. 113

సీ. ఒక్కండు పట్టుగా నూఁకొనఁ దబ్బిబ్బుబాటు గొల్లసివాలు పాడుకొనుచుఁ
బామునాడించు నేర్పాటునఁ దలయూఁచికొంచును జెంగు విన్పించుకొనుచుఁ
దమవారి గుమిగూడి దమ్మరాజులకత లొన్నటికష్టములేక నొడివికొనుచు
లయయొక్కత్రోవతాళంబొకత్రోవఁగా నేమేమొ ఢక్కవాయించుకొనుచుఁ
జిటుకుమన్నఁ బరామరిశించుకొనుచు, నంటుకత్తెలు తమపయనంబు నమ్మ
తించకాడిన వగఁ జెప్పుకొంచుమింది, రుక్కళపునల్లమందుల యొంటికాండ్రు. 114

సీ. వెఱవకుమని వెన్ను చఱచి వేలుపుఱేఁడు తెలిపిననింద్రాణి తెలియ దయ్యెఁ
దనుతానె తెలిసి మూసినకంటితోవాణి వీనులపైఁగేలు మానదయ్యె
నది పరామరిశింతునని యేగు పతినాఁగి జలధినందనకొంగు విడువదయ్యె
దడదడమన గుండె తాళిబొట్టుచర గుబ్బలిపట్టి పడుకయిల్వోళలవయ్యె
బాళెమున నక్కడక్కడఁ బదిలముగను, మ్రోయఁజేసినతముకుల మొదలిపోటు
దారమ్రోతల పటహంపుధణధణలకు నొంతిగా నండ్లనిటులున్న యంపలోన. 115

క. అలరాజు విజయ మెనయం, గలఁడని చంద్రుఁడును దారకావనితలతోఁ
గలహించి మడియనైచిన, పొలుపలరఁగ వేగుఁజుక్క పొడిచెం బెడఁగై 116

క. అంతట దనుజేంద్రుం డొక, దంతపుఁజవికెన్బ్రధానదైత్యులతోడ
న్మంతనమాడుచు నృపుబల, వంతపునైఖరులు వేగువారలు దెల్పన్ 117

క. పడవాళ్లఁ బిలిచి బలముల, వెడలింపుఁ డటన్న వారు వెసఁ జని నిద్రా
జడులను బలాళి వీరుల, వడిగా మేల్కొల్పి ప్రకృతవార్తలు దెల్పన్ 118

చ. అడరుచు వచ్చె నొక్కపలలాశి నిజాంగన సిగ్గుతోడి న
వ్వొడవెడు చూడ్కిచేతఁ దనయుల్లములోని పుసారతక్రియా
భ్యుదయపు వాంఛదెల్పఁ గనుబొమ్మ నడల్చుచు మీఁదివేలుపు
న్మదితల నంటు గానిపయి ముందుగఁ జొకఘటించె నోయనన్ 119

చ. ఒకదనుజాధినాథుఁడు మదోద్ధతి గంపమలందికొంచు గొం
చక చనుదెంచె నుగ్రరణసన్నహనంబున రాజమార్గణా
లికి నిఁక మీఁద డెందము బళీ యిరవౌనని యొమ్మగోడపైఁ
జికిలియొసంగి వన్నియలఁ జెన్నగు సున్నము పూయుకైనడిన్ 120

గీ. విరులు సిగఁ జుట్టికొని యొక్క వీరదైత్యుఁ, డరిగె నిఁకమీఁదఁ గల్గు కల్పావనీజ
పుష్పముల సారసౌరభంబునకు వాని, వలపునకుఁ బూని సరిచూడవలయుననఁగ. 121

క. ఈ నేలచుట్టుఁ దిరిగినఁ, బోనీయఁడు రాజు పాఱిపోరాదనుతీ
రూనఁగ నొకనక్తంచర, సూనుఁడు చక్రింబు ద్రిప్పుచుం జనుదెంచెన్ 122

క. అనలోపమనృపశరముల, మొనలంబడి తరణిబింబముం జొచ్చుగతిం
దనుజుం డొక్కఁడు గ్రక్కునఁ, గనకరథంబెక్కి యక్కు గ్రిక్కుచు వెడలెన్.

సీ. పడవాళ్లగమికిఁ జేపుడికి దబ్బఱనొప్పి పైపైచుకొని మూలఁబడినవారు
నిండ్లలోననయుండి యెటువోయిరోకాన మనిపించి కనిపించకడఁగువారు
నింటికావలికి నన్నిచట నిల్పరు గదా యని వేల్పులకు మ్రొక్కఁ జనెడువారుఁ
దొలునాఁడె నృపుసవార్తలు విని యొక లేనిపనిఁ బూని యెందెందొ చనెడువారు
గ్రాసములు చెల్లలేదని గాసిచేసి, కొలువుజీవితముల కొప్పుకొననివారు,
నగుచుఁ గోఁచపిశాచము ల్దిగులుపడఁగఁ, దక్కురక్కసిదొరలు ముందటను నిల్వ

సీ. నిలుచుండి వీణ చేతులఁ బూని తెలుఁగంటిబయకాఁడు మేల్కొల్పు పదముఁ బాడ
నలుకుతో నాల్గుమోములదేవుఁ డొకరౌర దినశుద్ధి దెల్పి వేవేనుక కొడుగఁ
దనయూరినుండి తెచ్చినపూలమాల జేజేలరాయఁడు చేరి చేతికొసఁగ

జోరవచేసికొని శంకరుఁ డిచ్చుకాలకు సఖుఁ డౌకుబేరుపైఁ జాడిచెప్ప
గడియకుడుక మునుంగుటఁ గని గురుండు, తెల్లవాఱెడునని పఱతెంచి పలుకఁ
గటికవారెల్ల దొరలువచ్చుట వచింప, దనుజపతిలేచి యొకభద్రదంతి నెక్కి 125
గీ. కోటకావలికై యాప్త కోటితోన, నీవు నీవని నియమించి నిలిపి తక్క
రక్కసులు వారణంబుల రథములందుఁ, దురగములయందుఁ బొడసూపి తోఁపనడువ
సీ. చెకుముకి యగ్గిజానకిత్రాటిమిడుఁగుఱుల్గాఱెడునది యొలగోలుమూఁక
వెదురుమల త్రెప్చ విధమున నీటియర్దాల్చిపాల్చియది దండిబారు
తిరుగోపులను దుమ్ము రెగయించునదిసిలేముస్త్రీబుగల కాలుమొకరిపౌజు
కొమ్ముకత్తుల మెఱుంగుల వెల్లవావడ గ్గానునది మస్తేనుఁగులచయంబు
సురగికిం ద్రంబుపిల్లలై చుట్టు నున్న, కనకరథముల నడుమ సింగాణి విల్లు
దొనలు మెఱయంగఁ దేజిపైఁ దోఁచువాఁడు, ధారుణీశ్వరుఁ డని వేసువారు దెలుప
చ. అరిగి మహాభయంకరతరాహవదోహలబాహువ్రతా
పరుచులు వోలు చెందిరప్పుఁ బానవచేఁ బుఱచేయి వీసిసు
స్థిరమతి నంపవెట్టుకొలఁదిం గజరాజము నిల్పి దానవే
శ్వరుఁ డెలగోలు నర్వఁగ నిశాచరుల న్నియమించి సంతటన్. 128
చ. అలరు మొగంబుతోఁ గువలయాశ్వము నిల్పి నరేంద్రవరాళి తూ
పులవాడిదోయి వీఁపుకడఁ బొందుపడం బిగియించి మించురా
చిలుక ల్రాఁతగచ్చుపనిసింగిణి చైకొని యెక్కువెట్టి సే
నలు తనసన్న గోరఁగ గుణధ్వనిచేయుచుఁ జేయి వీచుచున్. 129
క. పేరెములువాఱి యొక్కొక, చేరువ గుంపగుచుఁ దారసిలి యిరువాగుం
ఘోరపుబాణపుఁ జువ్వలు, బోరనఁ గొనవిఱిచి వైనఁ బొసఁగ న్మోపటన్. 130
క. కొనద్రుంచి నైచు బాణపుఁ, బెనుజువ్వలు వాఱి నేలపెట్టుగఁబడుఁజీ
బున సిగిడి కాలుసేతులు, దుసియలుగాపించి ముందు దుముసున నడిచెన్. 131
క. ఉయ్యాలచేరులనఁగా, నయ్యిరువాగులును దఱిమి యాటు దిరుగుచు బ
ల్క్రయ్య మొనరించి యించుక, డయ్యక యొడ్లె పయిఁ బెట్టుటయు న్ట్రియెపన్.
చ. ఒకపరియొడ్లలోని రిపులుగ్రతనైచు తుపాకి మందు గుం
డ్లకు వెనుదీయకాఁగి యచటంబడు సాపులఁ గోలుగొట్టనీ
య కనిఁ బెనంగి యంతఁ దరియం బడి యచ్చటివారలం గకా
వికలుగఁ దోలి యొడ్లు విడిపించిరి చేరువరాండ్రు మెచ్చఁగన్. 133

గీ. అలసినట్టి జనులు తేలి యవలికరుగ, వేఱుతుటుములు పెనుబోటు భేరిమ్రోఁత
లమర నరుదెంచి దొడ్డకయ్యమున నవియుఁ, బవలనంతయుఁగని పండిబారుగదిసె.

క. అంపజునిట్టలు వచ్చిన, యంపము గనుపట్టెఁ దక్షిణాంభోనిధి దాఁ
టం జెప్ప గట్టఁ బూనిన, చందంబున నలుగు లరిదిచాయల నీనన్. 135

గీ. ఒకఁడు కుంతానఁ బగవాని యురము గ్రుమ్మ
వెంటసేయాతఁ డీటెచే వెళ్ళఁ బొడువ
వెలసె నద్దలు నిల్చిన నిలుపు కడన
కాళికై కానడించిన కానుకనఁగ. 136

క. పగవాని గ్రుచ్చి యీటెని, నెగనెత్తెనొకండు రణమహీంద్రు మాలమునం
గగనమునుండి వ్రాలెడు, ఖగపాళుల కంది యిచ్చు కైవడి మెఱయన్. 137

క. జముదాడి నొక్కవీరుఁడు, విమతేంద్రుం బొడిచి వాఁడు వెస నిజభుజసా
రము మెచ్చి చల్లునవకుం, కుమబలెఁ పద్రక్తమున నిగుంభితుఁ డయ్యెన్. 138

క. అలుగునగచూపువేళం, దలతలమను నంతనోఁకిన నృగవానిం
గళ దాఁకఁ బెనఁగు నొకమొ, క్కలపుదొరకరాని నీటుకత్తియ యగుటన్. 139

చ. నిగళము లూడ్వనెత్తి కరిణీపతిచేరినఁ దేజిపావడన్
మొగమునఁ గప్పినూకి యొకమొక్కలపు న్నెఱరౌతు కుంభము
ల్పగులఁగ నేసిన న్వెడలెఁ బట్టనువెంటనే మౌక్తికావళు
ల్మగఁటిమి మెచ్చి చేరి జయలక్ష్మి సుమాంజలి యిచ్చుకైవడిన్. 140

మ. బలియుం డొక్కపఠాని రౌతు తనబాబాణూకుచు న్రెండువీ
థులమాస్టీలతలల్కరాసిలతికం దుండించుచుం జుట్టిరా
నలరెం డత్తనువు ల్ధరంబడుట భూతాజ్ఞప్తిచే వెట్టిమో
ప్రులు నేలం బడవైచి కూలఁబడుకాపుల్వోలె నప్పట్టునన్. 141

క. నరపతి యంతట దనుజుల, యురువడిఁ గని చేయివీవ నుగ్రాకార
స్ఫురతంగరులకుఁగరులున్, హరులకు హరులరదములకు నరదము లెదురన్.

సీ. రాజ నా చెయిచూడు గ్రాసంబు ఋణముగాఁ జేయుదు నే యంచుఁ జేరువారు
లలితంపుఁ దులశిప్రోగులు ద్రుంచి నోటిలో నైచికొంచుఁ దురీనవచ్చువారుఁ
గలనిలోఁ బొలియుటకంటె భాగ్యమ్ములున్న వెయంచుఁ జెగి యనికఁ జనువారు
నేలినవానికట్టెదుట నే పనికివచ్చుటగదా మేలని చొచ్చువారుఁ
బూర్వవైరంబు మాని సొంపులు జనింప

నొకని కొకఁ డెదిర్చి పొంచుచుఁ జికిలియోఁటలు
పాటనైచుచు వడిఁ జోరఁ బాఱువారు
నగుచుఁ దైజీతములవార లనికి నిగిడి. 143

క. దనుజులఁ గదిసిన నత్తఱి, జనితంబగు ధూళిపాళి చదలఁ బొదలఁగా
ననిమిషకోటికిఁ గరములఁ, గనుదోయిం బులుముకొనుచుఁ గనుఁగొనవలసెన్.

సీ. అరదము లుద్ధురదుర నరుదార నరుదేఱ నరదము లుద్ధురదురనరిగె నెదురు
కరులు ఘీంకార బంధురములై నడతేఱఁ గరులు ఘీంకారబంధురత నెదురు
హరులు హేషాతిభీకరములై పఱతేఱ హరులు హేషాతిభీకరత నెదురు
భటకోటి చటులతోద్భటములై చనుదేఱ భటకోటిచటులతోద్భటతమీఱు
సారథులు వ్రాలఁ గొమ్ములు చదిసికూలఁ, బక్కెఱలు వ్రీలఁ గరవాలపటలితూలఁ
కేడివారంగ నవి పోరు ఖేచరాళి, హర్షమునఁ జూడఁగా బొమ్మలాడినట్లు. 145

మ. చదిసెం దేరులు పాఱె వారణము లశ్వమ్ముల్గరం గూలెఁ గం
జెదరెన్ సైన్యము వ్రాలె బాహువులు వ్రేస్సెన్మాంసము వ్రాలెనం
గదము ల్ద్రీలెఁ గిరీటము ల్పఱచె రక్తశ్రేణి కయ్యంపుఁ జో
క్కుపడన్ర్పన్ భుజదర్పమొప్ప నిరువాగుం జేరి పోరాడఁగన్. 146

సీ. ప్రేగులుమీఁదఁ గప్పించి నవ్వేడు తలలెట్టాఁడులుగల తమ్మితుటుముఁ దెగడెఁ
గెంపుటుంగరపుడా ల్గీల్కొన్న బాహువు ల్ఫణమణు ల్గలయహిప్రభులఁ దెగడెఁ
బలు జముదాడి పోటులమించువక్షము ల్నెఱియ లానిన భూమిసీటుఁ దెగడెఁ
ప్రేటులరక్తము ల్వెడలించుతొడలు కుంకుమనీటి చిమ్మనగ్రోవిఁ దెగడె
దనుజమను జేంద్రసైన్యముల్ దైన్యమెడలి
కయ్యమొనరింప సంగరాంగణము చూచు
దివిజవర్యులు మొగములు ద్రిప్పికొనఁగ
నప్పు డమ్మక్కు యనిపించె నద్భుతముగను. 147

వ. వెండియు నుద్దండతరదండధరకోపాటోప విభ్రమభ్రమిత నయనభ్రమావహస్యంద
నసహస్రసంగతరథాంగనికరాపభ్రవిభ్రమణ విధూత ధూళీపాళికా ధరాధురావ
హ గిరిశదరీణకరీశ్వరంబును గరీశ్వరధారాధరక్షతజపూరపారావార దుర్వారత
రంగాయమాన కనకపరికరంబును బోరనెడఁద గాయంబులవారలం గుంతసంఘ
టితద్విషేటికాడోలికలం గొనిపోవువారును మున్నుఱకమై నెక్కినకత్తలాణంబు
లం బరులపాలు చేయ నోపక డిగ నుఱికి కటారుల డొక్కలు విదారించి

నడచి పడువారును క్షతంబులవెడలు ప్రేవుల నూడనీక యదిమి కదనోత్సాహం
బున దుప్పటులు బిగియించి యెదిరించువారును గెలుపుగాయంబులఁ బడియుం
డియు మండిగాలిడుకొని కైదువులు జడిపించుకొనుచు రౌద్రాకారంబున ను
న్నవారును గళదెలిసి నలుదిక్కులుం బులుకుపులుకునఁ జూచి మానధనంబునం
దొడిగినచల్లడంబు లక్కడక్కడఁ జించుకొనువారును బ్రాణనిర్యాణసమయంబు
నందును నిజస్వామివిజయంబె విచారించువారును నడుగకమున్న యభ్యర్ణంపునుడుఁ
గుల జలంబుదెచ్చి దప్పినివారించు బంటుల ఋణంబులు దీర్చుకొని వారితోనా
త్మీయులకు వలయు బుద్ధులుపదేశించువారును దెట్టువలుగట్టియున్న క్రొన్నె
త్తురులు గనుంగొని నెత్తురుకళవట్టి తమకుఁదామ వ్రాలువారును దొలఁగక
క్కడక్కడభ్రమపడజేచిన ముదురుమానిసులకతంబునఁ బోఁగూడక నమోనమో
యనుచున్నవారును గ్రించుఁదనంబునఁ గొంచెపాటిచెనకులఁ దెచ్చికోలువేదన
లంబడి తన్నుకొనువారును గలిగి సంగ్రామంబు గావున నధికధామంబును జన్యం
బు గావున భూతక్రియామాన్యంబును సమరతలంబు గావున ధర్మోజ్జ్వలంబు
ను నై యాసమీకంబు సమాకులితనాకలోకం బయ్యె మఱియు. 148

గీ. పోరఁ బెనువానగా రక్తపూరమొలుకు, కాయములు పూను భూతనికాయమలరెఁ
గేళిగతి నిల్చు రణభద్రకాళిమ్రోల, వరలు పన్నీరుతిత్తులవా రనంగ. 149

సీ. గ్రుడ్డులు మిడికించుకొని దప్పికిమ్మను దమవారినొక్క బేతాళమూళి
గ్రొంతుమ్రోచిన దిగుల్కొని నోర వ్రేలిడి క్రక్కునొక్క పిశాచికావిభుండు
అన్నువట్టినను మ్రాగన్నుతోఁ బొర్లాడు నేలపైనొక డాకినీవరుండు
కక్కుర్తి మెక్కి యగస్త్యమంత్రమువల్కు బొడ్డు నంటుచు నొక్క భూతనేత
తనివితీఱినత్రేఁపు విన్ననకునిక్క, శతపదాల్ద్రొక్కు నొక్క నిశాచరుండు
పలలరాసుల బువ్వంపుబంతివిందు, మించుబోఁడులతో నారగించువేళ. 150

గీ. ఒక్కనికళేబరమరసియుఁ దగఁదినక, వీనిఁబడవైచె నాతఁ డాపీరుఁ డనుచు
గాపనుచుఁ గుమ్ములాడునక్తంచరాళి, యెంతకార్యంబు దమకేమి యెవ్వఁడైన. 151

క. ఒకవీరవరుకబంధము, నకుమూఁగి పిశాచికాగణము భూతావే
శకమున నది యెగిరినచోఁ, బకపకనవ్వించె నులికిపడి డాకినులన్. 152

* సీ. శౌనకమౌని విశ్వామిత్రుతోఁ దెమ్మ పన్నిదం బనుచుఁ జేపట్టి తిగుప
శుకుఁడు * * * *

---

* ఇక్కడఁగొంతగ్రంథభాగము మాప్రతిలోలేదు.

మాలిని. ధరణిభరణశేషా దర్పకద్వేషవేషా, శరనిధిసితకీర్తి సౌధయూథాగ్రవర్తీ
వరగుణమణిజాలా వర్ణితోద్దిష్టలీలా । నరపతికులహేళీ నారసింహాత్మమౌళీ




ఇది శ్రీమన్మదనగోపాలకటాక్షవీక్షణాసమాసాదిత సరసకవితావైభవ సవరమ
న్వయాభరణ నారాయణభూపాలతనూభవ శఠగోపతాపసేంద్రచరణారవింద
సంచలన్మానసమిళింద సంతతభారతభాగవతాదిశ్రవణానంద కామినీమనోహర
రూపరేఖావిజితచైత్రి కాశ్యపగోత్రపవిత్రి జాతివార్తాకవిజనామోదసంధా
యక చిననారాయణనాయకప్రణీతంబైన కువలయాశ్వచరిత్రం బనుమహాప్ర
బంధంబునం బ్రథమాశ్వాసము.



శ్రీరస్తు.

# కువలయాశ్వచరిత్రము.

## తృతీయాశ్వాసము.

---

క. శ్రీరమణీమృదుపదలా , క్షారసకోపాయణప్రసారితపీఠా
దూరితవైరికలాపా , నారీనవకుసుమచాపనారనభూపా ! 1

గీ. అవధరింపుము జైమిని కలపతంగ , కులపతంగంబు లిట్లని తెలుపఁ దొడంగె
నట్లు పాతాళకేతుఁ డయ్యాతుధాన, పటలికన్నను మున్నుగాఁ బాఱుదెంచి. 2

క. దళవాయితోడఁ గోటకు , వెలుపటియిల్లుగొట్టి వేయించి పిదం
గులు లగ్గంబులమీఁద , న్నిలిపించఁగఁబనిచి నిగుడు నెవ్వగతోడన్. 3

చ. ఆరిగిపురంబుసొచ్చి పలలాశనమాళి కుమారుతోడమే
ల్సరియగు దైత్యులం గనుల న్నిలువ న్నియమించి యాయుస
స్ఫురణఁ బనర్చు కోటతలుపు ల్బిగియించఁగఁబంచి ధీరతా
స్థిరమతిఁ జేరఁగా నగరుఁజేరి హజారము నందు నిల్చుచున్. 4

క. మించు తమిఁ గణజము ల్దెఱ , పించుచుఁ గైజీతములను వేర్వేఱవ్రా
యించుచు నెలకొలువునకుం , బంచియిడుచు నుందుగుండుబాణములెల్లన్. 5

క. ఇటు లుండ నచట నృపుఁడు , ద్భటగతి దానవుని కూటిపాలెం బెల్లం
దటుకునఁ జూఱ లొసంగుచు , నటు నిలునక సేనతోడ నప్పురిఁ జుట్టెన్. 6

చ. అచలితవృత్తి నిట్లు విడియం దళవాయి పలాశి వీడు మె
చ్చుచు నలకోటకేగు జలసూత్రపుఁజోటు లెఱింగి యడ్డ క
ట్టుచు రసవర్గ మచ్చటకడున్వాడిఁ జేరఁగ నీక శూరతా
రచనలఁ జిల్లరల్బులుపు రక్కసిపాలియగాండ్రఁ గొట్టుచున్. 7

క. ముత్తికె వేయించిన దిశి , జోత్తముఁ డించుకయు బెదర కుద్భటధీరో
దాత్తమతి నగరు సొరక వి , యత్తటి నటునూను గవనియందె వసించెన్. 8

సీ. తెఱగంటిదొర నరాధిపు మెచ్చఁ జనుటకై నలువతో నాలోచనంబు సేయ
నిలనుండి వచ్చు వేగులవారి వెంటనే సురవరాని గొణుగుచు సుద్దులడుగ
గిరిభేది నగరివాకిటివార్త లడుగంగ దిగధీశులు నియోగి తెగల నంప
అడ్డెలు విడి, వేల్పు లమరగాండ్రసురేంద్రు కార్యకర్తలబందుగట్టికొనఁగ
భూరిభుజశక్తి ముచ్చిమిపోటు గాఁగ , మేదినీభర్త పాళెంబుమీఁదఁబడిన
దానవులమూఁక తన్మహోత్కటకటాగ్ర , ఘాటిఁ గ్రోడించి కమ్మఱఁ గోటఁ జేరు.

సీ. ఆచ్చర చెలువ లుయ్యాలచేరులు నేలవైచితి రని తోడి వారిఁ బరఁ
జోటించుకయు లేక కోటరంబులలోని యురవుపాములు పెఱ బొఱియఁజొరఁగ
నఖిలపక్షులకులాయములుఁ బోఁ బిల్లల గఱచి యవ్వలి కోనకడకుఁ బఱవ
ముంచి చీఁకటులుకల్పించు నీడలు పోవఁ బద్మాకరంబుల పాఁచి విఱుగఁ
జెట్టుగులులేని పెనుగారుచిచ్చు వచ్చె, ననుచుఁ జెంచెత లెంతకై యలమటింపఁ
బార్థివేంద్రుని భటులు డాబాలు నడుప, నఱికి రయ్యద్రిపై విపినంబునెల్ల. 10

క. దనుజుల తుపాకిగుండు, ల్గనఁబడు డాబాలు పలకలందాఁకి బిరీ
లునఁ దిరుగుఁ దమనియోగిం, చినవారల నొంచ మగుడు చెలువం బమరన్. 11

క. మనుజేంద్రుఁ డంత సేనలఁ, బనుపుచు సురతాణి లగ్గఁబట్టించిన న
ద్దనుజపతి వీరధర్మం, బునఁ జెగువకుఁ జొచ్చి యెదుర ముదిరిన కినుకన్ 12

మ. అరరే వేఁడి మెఱుంగు తూపుఁ గొనియయ్యా యెంతయో వింత యా
నరనాథాగ్రణి యేయఁగా నది దిశాంతభ్రాంతరోచిర్నిరం
తరమై వాని శిరంబు నైకొని యనంతాకాంతపైఁ దాల్చపం
తురసంతోషహృదంతులై దిగధికాంతుల్చెంత చింత ల్విడన్. 13

ఉ. అంతటఁ జేరవచ్చిన వియచ్చరనాథుల దీవనల్మహీ
కాంతుఁడు గాంచి వారి వృషగౌరవసారవచోవిభూతి న
త్యంతము సంతసం బొదవ నన్పి నిజాంచితసైన్యము న్బహిః
ప్రాంతమునందు నుంచి పరహాసవిలాసవిభాసమానుఁడై. 14

క. నగరిపురిపునగరుంద, స్నగరీరథయూథసౌధనానావిధరు
గ్గగధగలు చూచువేడుక, చిగిరింపఁగురింపరాని చిడిముడి వొడమన్. 15

క. ఒక్కఁడె పవనోద్భవజన, ధిక్కరణధురీణమైన తేజిన్వడిగా
నెక్కి ప్రకాశాత్యవశప, దిక్కంబగు పురముసొచ్చి ధృతి నచ్చోటన్. 16

ఉ. గోడలు గోష్ఠము ల్గరిడి గుళ్లు గృహాంగణము ల్గజస్థలు
ల్మేడలు మేలుకట్టులును మిద్దెలు ప్రాకలు మేలుమచ్చులున్
వాడలు వేదులు న్విపణివర్గములు న్వనజాకరంబులుం
జూడఁ బదాఱువన్నె గల శుద్ధసువర్ణము లౌట మెచ్చుచున్. 17

సీ. పరఁగఁ బిరంగిల బలుగుండ్లకై డాఁగఁ బఱుక లమర్చిన పాఁతరల్లును
వెలుపటి మంచుతిత్తులు నూలిన యరాబు కొఱకమర్చిన పచ్చిగోడగుంపు
లెనసి మాస్తరు లగ్గకెక్కుకుందంగఁ దాల్చిన కాంచనంపు పందనపుఁ జేతు

తెఱచటి సురంగంబు తెఱఁగి యా చాయఁగాఁ గల్పించుప్రతి సురంగముల గములు
ప్రతిబలముప్రేయు తిరుగుడు ఱాళ్లకతనఁ, గుమ్ము లానిన బంగారు గోడలురలి
పడిన మగరాలు చూర్ణమై పుడమి రాలు, నీలములచాలుఁ జూచి వర్ణించుకొనుచు. 18

క. ఘోరవశాధార నిశా, చారికృతాంగులను జూచి జడియకుఁ డనుచున్
సారతరదాత్మమహిమం, బూర ధరాజాని యభయ మొసఁగుచునంతన్ 19

సీ. కోటవెట్టికి ముద్దుగుమ్మలతో మట్టి తట్టు లందిచ్చు గంధర్వచయముఁ
గనుసీళ్లు పులిమికొంచును బానశాలలో మంచు గట్టించు నమర్త్య కులము
మలఁగికొంచును ఫిరంగుల లగ్గములమీఁది కురువడితోఁ జేర్చు నురగగణము
బలిమికాండ్రగు రక్కసులకు సంకెళ్లతో జలకుంభములు మోచుసాధ్యపటలి
విబుధరిపు పాటుఁ జెప్పుకో వెఱచిముత్తి, యపుహజారాన గుసగుసలాడుచున్న
కిన్నరశతంబుఁ గని బుజ్జగించి పనిచి, ననుచు వేడుక తోడుగా నగరు జరిసి. 20

సీ. వలఁగిన మైలచీరలను మైఁ బొంగారు సిగ్గులు బంగారు నీరుగాఁగ
ముడివీడు నిడుదక్రొమ్ముడుల డాలు శరీర మునకు నల్లని మేలిముసుఁగుగాఁగఁ
బచరించు కఠినభూభాగమ్ముమీఁద నిబ్బరపుఁ జూపులు కల్వపాన్పుగాఁగ
నాఁకటి కన్యోన్య మలసతమై నాడు మాటలె యమృతంపు తేటగాఁగ
దనుజు చెఱసాల నున్న గంధర్వకాంత, లపరిపాటునఁ దనుఁజూచి లేచి
కొంకుసిగ్గులతో మఱుంగులకుఁబోవ, నిలచి వారలఁ జేర్చి మన్నించిపనిచి 21

క. తోవరాచరాతినిద్దపుఁ, జవికెల తెగల న్నగళ్లచా వళ్లను నుం
బవడంపుఁ గొణిగెల లోగిలి, నవరని కేరులనుదాఁటి చనఁ జననెదుటన్. 22

గీ. పచ్చిదేరఁగఁజిలుక బాబా వజీరు, జగడమునఁ గుమ్మలాడు నచ్చరమిటారి
కత్తెయల వేల్పు నెఱసీటు కాంద్ర రూప, ముందు బొమ్మలుగల మేడయొకటిగాంచి.

క. తగురా మగరాసిగనిగ, లగురా తోగరాచసాలల స్వప్ననువుం
బిగడాలడా లిదెంతటి, సొగసని తేజీని డిగ్గి చొచ్చెంబలరన్. 24

మ. చనుచో నాతని కందుఁ గన్గొనవ విశ్రాంతంబు లయ్యెంగడున్
వఁతా యెంతటి వేల వే నెలఁత యైనం జింతనే చింత గుం
దుచటే యంపని మ్రాని పండులకుఁ జేతుల్ చాతురే యైన న
ద్దను జోవంతె మెఱుంగు నంతకును గాంతా తాళుమ న్వాక్యముల్. 25

క. అది విని మఱియున్ విసివిని, యిదియేమో కాని చూతమిపుడనియవనీ
ధవనేత బూరికోరిక, నవలికి జని జనిత విస్మయ నిమగ్నుండై. 26

సీ. పలచనిపావడపై నొంటి కట్టుగాఁ గట్టిన వలిపె చెంగావికవను
పాన్పుపైఁ బొరల నిబ్బరపు గుబ్బల పొరపటలి పెటిల్లునఁ జిటిలిరాల
కెరలు నిట్టూర్పులఁ గెమ్మోవి, బగులంగ గోరునఁ జిమ్ము కన్నీరువడిన
బంగారు గోడకరంగిపోవఁ దలాట బటువుల్లంతటఁ బడఁగ నేమొ
పనికిదిగ్గనలేచి పూపాన్పుమీఁద వ్రాలి కూర్చుండి ముక్కుపై వ్రేలు నిలిపి
యొక్క చెలికత్తె యూరార్పఁ బెక్కుతలఁపు లన్నుకొనుచున్న యొకవన్నెలాడిఁ గాంచి.

మ. భళిరా కన్నులు మీలఁ కీసొగసు రూపా చాల సేబాసురా
కళలందించ్చు మెఱుంగు ముద్దుమొగ మింకం జంద్రుఁడాదీనిముం
గళ నౌరా బలితంపు గుబ్బలివియే కాబోలుఁబూచెండ్ల మిం
డలు మేలే కురు లింద్రనీలముల కన్నన్ మిన్నలౌ నేకదా. 28

క. నెమ్మిగదానడతుమ్మెద, దొమ్మిగదా బెడఁగుగురులు తోలుకరిమించుం
గమ్మగదా మెయి మరు దో, దుమ్మిగదా తగిన చూపు తొయ్యలికిభళీ. 26

ఉ. పబ్బర కౌను మాట వనితామణి కౌను మెఱుంగు జాళువా
గుబ్బలి జేని కోటవలి గుబ్బెత చన్గవ వేల్పుటాచరా
వ్రబ్బల మేలి తేట యలరాజ ముఖీమణి వేణికారుచుల్
లిబ్బిపడంతి పట్టి కవలీల జయంబగు దీనిప్రాపునన్. 31

చ. కలకల నవ్వువట్టున మొగంబు వరాలను చారెడేసి క
న్నులు పిడికింటిలో మిను మినుక్కను కౌనును ముద్దుగారు ప
లుకులఁ జవికమ్మచేఁ దళుతళుక్కను చెక్కులఁ బట్టుడేసి గు
బ్బలుఁ గను చూపు మేరకు గుభాలను తావులు దీఁకె తగున్. 32

ఉ. జక్కవపిట్టకున్ గలికి చన్నులమిట్టకు నేమిపుట్టువో
చక్కెరదీవికిన్ వనిత సన్నపుమోవికి నేమి వావియో
నిక్కువదానికిం జెలువ నిద్దపుమేనికి నేమిసేస్తమో
చుక్కలకోటికి న్మగువసొంపుల గోటికి నేమి కూర్మియో. 33

క. అనియెంచి యించువిలుపే, రుని యలుఁగులగుంపుమది చురుక్కన నాటన్.
జనియించిన తమకమునఁ, గొక్కని ముంచినఁ గఱఁగి తెచ్చికొల్ ధృతిమించన్. 34

క. ఎంత కడంగి నుతించిన, నంతకుఁ దగునేకదా మదాళినవాళీ
కుంతల కాంతనసుమనః, కుంతలసపహాంగకంది కుందెడిదేమో. 35

చ. కనుగవకెంపు కొప్పువిడఁగా ముడిగొల్పెడు బొందిమీఁది జం

కననెఱచూపు నెవ్వరు సగించని నవ్వు బయల్గుఱించి ప
ల్కను గళదేరు మేనుఁ గనుఁగొన్నను జక్కరబొమ్మయొక్క చ
క్కని మొగవానికి న్వలచెఁ గావలయుం గలయం పలంపఁగన్. 36.

క. బలవంతపు వలవంతలఁ, జెలువంతయు నేరిసొమ్ముఁ జేసెనొకోయీ
వలపునఁ దగిలినవానికి, దలపున లవలేశమైన దయలేదే మో 37.

ఉ. వానిదిగాక జన్మమును వారము నీరమణీలలాల య
య్యో నగు బాటుగా నతని యొద్దకు నెచ్చెలిఁ బంచి పంచినం
దాని టురాక వేఱిమియొనర్చునో నావలపంచు నించు వి
ల్కానికిలొంగి నెమ్మదిఁదలంచుకొనన్ వలపించె నెవ్వఁడో. 38

క. అవ్వల నొకనికి మీఁదుగ, జవ్వనమిటుగట్టియున్న జలజేక్షణతో
నెవ్వగఁ బలుకులు పలికిన, నెవ్వగ యేకాని చేర నేరవు కోర్కుల్. 39

గీ. ఐన నేమగు దీనివృత్తాంత మెల్ల, దెలియవచ్చుఁగదా యంచుఁ దొలఁగియొక్క
లోవమఱుఁగున నిలువ నాలోలనయన, జేరి నెచ్చెలిహారాళిఁ జిక్కుదీర్చి. 40.

మ. తలిదండ్రుల్ మన మీనిశాచరునిచేతం జిక్కిదిక్కేది యీ
యిలఁ గాసిల్లుట గానకేమయిరో వారేమైనఁ గానిమ్ము నీ
యెల ప్రాయంబు నిరూఢి కాసపడి వీఁడేమేమి గావింప వ
ఱలుచున్నాడో యెటుంగ మిందులకె యింతీ వంత లేదాయెనే. 41

క. అక్క బుశధ్వజభూవరుఁ, డెక్కడ నీ వెక్కడే యిదేమిటికే నీ
చొక్కపుఁ జక్కని నెమ్మే, నిక్కాఱియ కోర్వ నేరదే వగయేలే. 42

చ. తలపున నెంత మోహ పరితాపము గల్గిన దాచుకొందురో
యలయక లేక యీకరణి నంగడి వెట్టిదురో వధూటులా
పలుకవు నిన్నువంటి కులభామలఁ గానవొ వారికాత్మ నా
థులపయి బాళిలేదొ తమిబుట్టిన పట్టున మట్టుపెట్టరో. 43.

క. తగులెటుఁగఁ జేసి కూడఁగ, మగవానికిఁ జెల్లుఁగాని మఱియెంతైనన్
మగువకుఁ జెల్లదు మీఁదట, నగుబాటగుఁ బిన్నపనులనన్ రాదు చెలీ. 44.

ఉ. నీమది నింతకోరిక జనించినయప్పుడు యెట్లు కూర్చునో
యామరుఁ డింక నిన్ను వసుధాధిపమౌళికిఁ గూర్చకుండ నే.
మీమనమంతగా రిపులమే మఱివానికిఁ గానఁగీఱిగా
దేమరియాప తప్పినసతీవిను మొక్కటి సావధానవై. 45.

క. మనలం దెచ్చిన యా దై, త్యునిబాధలఁ గలఁగి మునులతో తెరఁగన
జనపతి యాతనితో నిదె, యని సేయుచు నున్న వాఁడటంచును వింటిన్. 46

క. పురజనుజ కామినులు కా, తరలై తరళైకవ్యాపయుతం గుందుచు నా
తురలై గరళైధిత వా, క్పరతంత్రత మాని యునికి గనుఁగొనుమబలా. 47

క. గావున నృపతిజయించెం, గావలయుం జూడు మొహము కన్నపరు నసం
గావిని పలికిన దానవు, నీవాయని చూచి కామినీ మణి కలఁకన్. 48

గీ. యేటి పలుకమ్మ యతడు నన్నేల యేలు, తిరిగి సంధించి నన్ను బోధించరాకు
మింత యేమిటికింక నాయించు వింటి, వానికెక్కిన ప్రాణమే వామనయన. 49

చ. అనిపలుకం ధరాధిప సురాధిపుఁడీసతి నెమ్మనమ్మునన్
ననునెరయం దలంచుట కనంబడె బోటి ఋతధ్వజేశ్వరుం
డని కొనియాడె గాన నటులైనది నిక్కమయ్యెనేని నే
దనువిపుడీ వధూమణి పదంబుల వైవఁగఁ దామసింతునే. 50

శా. నాభాగ్యంబది యయ్యె యీయతివ యందంబిందు భావించినా
కేభంగింగవయంగఁ గల్గునని యూహింపన్ మనస్త్వంబుగా
నాభీలాభవ భూరి ఫాలపహనాభానంగ కౌక్షేయక
క్షోభత క్ష్యుతఁ జెంది యున్నయది యిచ్చో మెచ్చ వచ్చుంగదా. 51

చ. ననుఁగొని తెచ్చినట్టి మునినాయక నిన్ను నుతింతు నోబలా
మునిఁ గొని యాడ నేల పెను మొక్కలిరక్కసి కేనికై కదా
యనుకల భావనాపరవశాయంబుగ వచ్చితి గాన నింక నా
తని యవదానమెంచవలదా జలజాలక నిందుఁ గాంచుటల్. 52

చ. ఇపుడిటు కానుపించుకొని యేను ఋతధ్వజరాజనందను
పట్టపు దమిఁ దెల్పి జాణయగుటన్ జెలి యెవ్వలికేఁగ సిగ్గు దో
రపువగకొంత జారఁగ బరాబరి సేయుచు నిందు మారక
య్యపురుచిఁ జూపి దీనివిరహాంబుధికింగడఁ జేరనిత్తునో. 53

సీ. యీగుబ్బలిఁక మీఁద నాగోటికొనఘాటి గదిసిన గజిబిజి గాకయున్నె
యీమోవియిఁక మీఁద నామోము మునిపంటి ఘాతచే నలిబిలి గాకయున్నె
యీదేహమిఁక మీఁద నాదు కౌగిలింత వగచేత వసివాళ్లువాడకున్నె
యీకురు లిఁక మీఁద నాకూర్మి పెనఁకువ, పాటుచేవడిఁ జిక్కువడకయున్నె
చిక్కువడుగాక యేమి నా చింతదీఱ, ననుభవింపక పోనేర నకటయిట్టు

జేల తలచితిఁ బువుబంటిదిలతాంగి, గాననొకయింతయోర్వదోకద యిదేల 54

క. భళి యేటి కోర్కు లివితో, య్యాలిచేఁ బేర్కొన్న యట్టి యాతని నసుఁగా
దలఁచితి వేఱొకఁడేమో, యిలలోన ఋతధ్వజేంద్రు లెందఱు గలరో 55

గీ. జన లోకసాధనం బున్నదా ఋతధ్వ, జేశ్వరుం డీ పలాశిలోకేంద్రుతోఁడ
నని యొనర్చుము న్న వాఁడని వయస్య, పలికెఁ గావున నతఁడె కావలయు నేను. 55

క. అన్నిటికిని మంచిదియే, సన్నలతాంగులను డాయఁ జని తద్వచనా
చ్ఛిన్న మకరంద ధారా, భ్యున్నతికిం గర్ణపుటము లొగ్గుటయనుచున్. 56

ఉ. లోన మఱుంగువాసి జనలోకరసాకరబాకశాసి మై
తావులకంటె మున్నరుచి ధారలు బారులు దీర్చఁగా రతి
స్త్రీవిభు రంభ చుట్టమును జెక్కులి గొట్టు నొయార మొల్కఁగా
నావనజాక్షు లున్న యెడ కద్దరిపాటున వచ్చి నిల్చినన్. 57

చ. కనిహృదయంబు ఝల్లుమన ఘల్లుమనంగఁ బదాంగదంబు ది
గ్గన దెస లేచి లేనడ యొయారముతోఁ దెరచాటుఁ జేరెఁగా
మిని చెలికత్తె తత్తరము మెక్కొన గద్దియఁ దెచ్చి యుంచ మిం
చిన తమినందు మీఁద నివసించె ధరావరుఁ డాదరాత్ముఁడై. 58

ఉ. అంతటలో ఋతధ్వజ నరేంద్రుని మోహనమూర్తి మున్న గ
న్నంతయుఁ గన్నులంబడిన నాతఁడు కాడ యతండె యౌఁగదా
కంతుని దాడికిన్ వెరవగా యని డెందమునందు నెంతయుం
జింతవహింపుచుండె సరసీరుహలోచన బోటి యచ్చటన్. 59

చ. ప్రకటగుణాంక యోపురుష సింహమ నీమహనీయమూర్తి మా
మకహృదయాంబుజమునకు మక్కువ నెక్కొనఁ జేసె నింకఁ గొం
కక కనిపించుమంచు నడుగన్ బనిలేదయినన్ శుభాభిధా
యకమగు నీచరిత్ర ముదయంబులకుం దగు నంద మొందఁగన్. 60

చ. బహుతరదేహధామ ఘనబాహు విహారముఁ జూచినన్ మహా
మహుఁడవు గాక యొక్క నరమాత్రుడవే యనిదానె జెంగియున్
సహజపుముగ్ధ తాగుణమునన్ వినఁగోరితి గాక నీశుభా
వహన ధురీణమైన గుణవారము నే వినునంతదాననే. 61

గీ. ఓమహాభాగ నీకథాభ్యుదయమెల్లఁ, దగినచందాన వినినయందాక లేదు
పారవికహిత ఘోరారాతి వారిరాశి, మగ్న మామక చేతోతి మహిమకతన 62

క. కతలయ్యా మావితమా, వెతలన్నియుఁ దెలుపఁదగున్న వీఁపు వినుమా
జతనమున గుణము లనియెడు, రతనంబుల గని యటంచు రమణివచింపున్. 63

వ. అని చెప్పి మఱియు నెచ్చెలి యిట్లనియె. 64

సీ. అనఘు విశ్వావసుండనియెడు గంధర్వరాజు దుర్గాపురిత్రాత వెలయు
నతని పాణిగృహీతి హారిణియనుపేరుగొరి కాంచినముద్దుగుమ్మ మించు
నాయమ్మ సుతులెంపఁదైన గల్గియు కూతు, రొకతె లేమికిఁ జాల నున్మళించి
యాత్మ జాత నొసంగుఁడనుచుఁ దేవుండనియే, కంటఁ బడురాతికెల్లమ్రొక్కి
నట్టిదకదా వధూటుల కల్లుఁడనుచు, నగవు పగవులటంచు నెయ్యంబులంచు
సంపకములంచు మఱియెన్నియైనకలవు, కాంతులవియుండె మీఁపటి కతలు వినుము

గీ. అంతనకాంత గర్భాలసాంగియగుచు, నాకుఁ దెలియదుగా యొకనాటిరేయి
నంపఱును మంచిశుభవేళ యనుచుఁబలికి, రప్పుడీ యుద్భరించెడు నమ్మఁగనియె. 66

గీ పుట్టినప్పుడె జన్వనంబును సమస్త భామినీకోటిఁ దలదన్ను పాటిచెలువు
గలిగె దీనికి నదియె దుఃఖములకెల్ల, మూలమైనది యంత నాలోలనయన. 67

క. అసమాన వయోమానమున, లసమాన కలాదులం జెలఁగఁ జూచిమదా
లసయనుపేరిడె విశ్వా, వసుఁడున్ హారిణియు గారవంబునఁ బెనుపన్.

ఉ. అయ్య పరాకు మాప్రియవయస్య యటంచు వచింపలేదు మా
తొయ్యలి వీధిలో నోఱపుతో నడయాడఁగఁ జూచెనేని యా
తియ్యని వింటిజోదు శరధిం గదియించిన పూవుఁదూపులే
యొయ్యొడ వైచికొంచుఁ దమిహెచ్చినఁ బోఁ బొరలాడకుండునే. 68

క. ఏటికి మాటలు నాఁటికి, నేఁటికి మగవాఁడు వలచునే కవ వినుమా
బోటి తటాలునఁ జూచిన, నాఁటదివలచు స్మనోంబుజాగ్రమునంచున్. 69

సీ. బలవైరి పనిచినఁ బిలువ వచ్చినవానిఁ, గనుసన్నచే నిల్పి కడకుఁ బనిచి
మూపుపైఁ గేలుంచి మెచ్చాడుచు వచ్చు నలకూబరుని మన్ననలు వరించి
నెనరుతోఁ గడునాచి కొనివచ్చు నును గచ్చు టరిగెలవారి నందందునిల్పి
కడువేగ మడుపులుగైకొని యుడిగంపు రాజీవముఖిహాజారమున నిల్పి
కొలువునకునేఁగు రంభ నిచ్చలముగాగ, నగరులోపలఁ జొచ్చి మానాతిఁ జక్క
దనము వీక్షించి యామెనిద్దంపుఁ జెక్కు, నొక్కముద్దిడుకొనిపోవునొక్కవేళ. 70

సీ, శచిచేత జంభశాసనున కొక్కొకవేళ స్వారిసరాగాలు జరుగఁ బొసె
రంభచే నల యక్షరాజపుత్రకునకు లలి హాసారుగ వెసలంగఁ బొసె

బార్వతిచే నష్ట పద్మారి వాళికి నిట్టట్టుఁ బీరంబులెత్తఁ బాసె
కమలచే నీలమేఘశ్యామమూర్తికి గరుడునెక్కి వయాళిగనఁగఁ బాసె
నెందుసర్వసుపర్వసర్వేంద్రు ముఖుల, చేతనిశ్శేషదేవతా శ్రేణికెల్ల
సవన కొటులలోఁగట్టుగపలఁబాసె, ననఘ మానాతి జూతురో యనుభయమున. 71

ఉ. అవెతలెస్సయైనఁ గలవయ్య మహాత్మ వచింప భారతం
బీవనజాక్షి మెచ్చఁ జనదెవ్వరి నెట్టి మహానుభావుతే
జోవిభవంబు దెల్పినను జొక్కను నెవ్వరి రూపమెంచినం
దావిననట్లు పోవునొక తప్పుపనుల్ గదియించి యవ్వలన్. 72

గీ. అంత నొకనాడు తలితండ్రు, లనుప భూమిఁ గలవిశేషంబు లీక్షింపఁదలఁచియేను
లోనుగాగల నెచ్చెలుల్ వేనవేలు, గొలువ సిగ్గుజయాన యియ్యలకు డిగ్గి. 73

క. ఇందుఁగల పుణ్యభూముల, నందందుఁజరించి కోకిలాళిమదాళీ
కందళిత కేళిపాళిన్, నందనముం గేరు నొక వనంబున విడిసెన్. 74

చ. విడిసినయంత నొక్కదొర వేఁటకు వచ్చెనొ కాని కొంచెపు
న్నడగని నెక్కి చేతను గసంబడు నెట్టెము మీఁది జేగయున్
బడలినమోము గువ్వగుమి పట్టుల బొలుపు చూపు మించఁగా
దొడిఁదొడినూడిగంపుఁ దెగతోఁ జనియెన్ మముఁ జూడఁ జేమియున్. 35

గీ. అతనిఁ గనుగొన్న నేకన్యయైన వలచు, నమ్మహారాజుదురగవేగాతిశయము
నంది చనలేక యంతంతనరుగువారి, నదుగవారు బుతధ్వజుండనుచుఁ జనిరి. 76

గీ. ఆతనిఁ జూచినపుడె యీసుధాంశువదన, యదియనెపముగరతిదేవియాక్రమముచి
నోటికందియ్యవగకోటి నూటికోట్లు, యొసెనేర్చి మనోజాతుఁ డింతిమీఁద. 77

చ. అదిమొదలీవఘూటి విరులంటదు కస్తురి గీరుబొట్టు పె
ట్టదు పువుఁదోట రాయదు పటంబులు వ్రాయదు వీణచెంతఁ జే
రదు నెనరైన చిల్కనుకరంబున దాలిని ముద్దటంచుఁ దా
గదియదు కంజకాండ కరకార్ముక కర్మహతాహతాంగియై. 78

చ. చెలుల మొఱంగినిల్చి తనసిబ్బెపు గుబ్బలు నారతీరు ని
గ్గులుగల కేలుఁదమ్మి కనుఁగొంచు నయోయిటువంటి మేనికిన్
వలదె తదీయచారుతర వక్షముదం బువుదండఁ బోలె నీ
యలసత దీప నిద్రఁగననంచుఁ దలంచి వితాకురాలగున్. 79

చ. ఎటువినరేంద్ర పాళి తనయింటికి వచ్చిన యట్లుగా మదిం

పలఁవుచు నిస్తులోక్తి మఱుఁగునన్ నిలువంబడి వచ్చినాతఁడా
చెలువుఁడు చూడ రేయనినఁ జెల్వలిఁ దెవ్వరిఁగానమే యనం
దలఁకుచుఁజూచి కల్లయె యనంగదు చెల్వలఁ బొరు దీనయై. 80

సీ. అధిపప్రతాపాగ్ని నరికట్టుకొన్నట్టి, సొంపునం గనుఁదోయి కెంపు పసరఁ
బతికీర్తిచంద్రకాపటలిఁ గౌఁగిటఁ జేర్చు మాట్కి మేనున బాండిమంబు వెలయ
విభుదానధారాంబువితతికిఁ జోటిచ్చు పోలుపున శ్రమజలంబులు చెలంగ
నాయకధైర్యంబు బాయకుండఁగబట్టు కైవడి నైశ్చల్యగరిమ మెఱయఁ
గడపట నిజేశు మదిలోనఁ గట్టివైచి, కొన్నగతి సంతతధ్యానగుణము పసర
నమరియున తండు గనిపించినట్టులైన, నదరిపడి లేచుఁ జెలెల్ల నిదురలేక. 81

సీ. తలచూప వెఱచు నీయళివేణి సమరంపసుమబృంపనవకాంచనములు గన్న
పెదవెత్త వెఱచు నీబింబోష్ఠి తరువార సుకుమార తతధీర శుకము గన్న
బొదఁగట్ట వెఱచు నీపువుఁబోఁడి ఝంకార భారాతిభయదషట్పదము గన్న
నడుగిడ వెఱచు నీయబ్జపాదసమీప వికటానుభావహంసికలఁ గన్న
వెడవిలుతుచేత నగు నలజడియుఁ దేనె, జడియుఁ గమ్మని తెమ్మెరల్ తోడరుజడియు
నలయు నెమ్మేనఁ జలువఁ దాకలపరించుఁ, గలవరించు నొకానొక కలవరించు. 82

క. పొన్నలకుం దెలిజాబిలి, మిన్నలకుం బలుకు చిలుక మేలిమిపలుకుల్
విన్ననగున్ విన్ననగున్, గ్రొన్నగుంపులకు దిగులుకొని మదిఁ బొగులున్. 83

క. ఈరీతి నారికేరీ, శారీభారీకృతోక్తి చకితాత్మికయై
పారరహితవిరహదశా, పారావారమున మునుఁగఁబడియున్న యెడన్. 84

మ. తనరెన్ మన్మథజైత్రయాన సుముహూర్తప్రక్రమంబేను పే
యనిశృంగారము భూరుహాళికి రతివ్యాలోల బాలామనో
జ్జనవప్రేమలకుబ్బు మంపలి వధూజాలంబు పాలింటి పి
ల్వని పేరంటము వాసనాజనకమై వాసంతమాసంబిలన్. 85

క. బెనగడరె లతావనితలు, నడతెంచు వసంతరాజునకు నడుగులకున్
మడుగులు వఱచినకైవడి, నడరెను తెమ్మెరలఁ బండుటాకులు రాలన్. 86

చ. తనరస మెల్లఁ జూపవలదాయని వేళ యొఱంగి యత్తరిన్
గనఁబడు మన్మథాగ్ని మొలకల్ వలె పోసులుగా జనించి యా
మని పథికాంగనాపురుష మంపలి డెందములొందఁ బంచి వే
సినగతి కెందుగాగ విరిసెం పలిరాకు వనాంగణంబులన్. 87

క. తను కుసుమేషుస్థానము, గామినిల మృదుపాద మగుటకు నైపుణ్య
క్రమ మొందిన సరణి రసా, లములుం గెంపలియుటాకులం బస రెక్కెన్. 88

గీ. చిలికె వనరాశిలోనఁ బ్రవాళపాళిఁ, గాంచి యీసునఁ బలెఁ బొడకట్టినట్టి
ముత్తియపు గుంపులను బలంపులు జనింప, తారకతమోనివారకకోరకములు. 89

క. మనలతకూనల మాధవుఁ, డనువుగఁ గూడె నని యున్న రను వనపద్మాం
గనల ముకుళీకృతాస్యము, లనఁగాఁ దరులందు మొగ్గ లరవిరి యయ్యెన్. 90

క. మనసిజుఁడు రోఁజుచుంది, మ్మను తుమ్మెద నల్ల ప్రజలకై నానా పు
ష్పరికరపళీనవ్యాజం, బున నత్తఱిఁ దేనెకణజము లైంపించెన్. 91

గీ. లతలసామ్మైన కుసుమజాలంబు లొరయు, నకరువులపేరి యెమ్మెచ్చు పెకలిరాలఁ
దొడిమలక్రిఁ బచ్చతాతుటము గాను, పిందె ననఁ బసరుఁజాయలపిందె లమరె.

గీ. మన్మథబ్రహ్మమునకు సమానదేవు, నొకని గల్పించి కైకొనరోయి యనుచు
నలసురతుఁడు గట్టి వ్రేలాడు పసుపుఁ, బూఁతజాలెలవలె ఫలంబులు సెలంగె. 93

క. ప్రాలిన విరిజొంపముపై, రాలినపుష్పాళులు ప్రసవరస మనుమ్ర
గ్గులుకొనఁ బొలుచుచిలుకగు, ఱాలదు సేదారి కొలుచురాసులకంగన్. 94

సీ. దాఁపఁబెట్టినవా సుధామాధురీసురీణమరందబృందసూనవ్రజములు
కాకాచులా యనగ్గళీపచేళిమఫీదేళిమచూతపోతావళీఫలములు
సంతరించినవా విశాలమార్గ ననిర్దయోల్లూనకదళార్హ పల్లవమ్ము
లప్పళించినవా వియద్ధరాసత్థలిప్రారూఢసంచారిసౌరభములు
దొమ్మిగాఁ దుమ్మెదలువూఁగి తొక్కులాడు
పూగుతోఁ గీరములు చేరి జగడమాడు
గొంటుగాఁ గోయిలలు రేఁగి కుమ్ములాడు
మొనసి వలితెమ్మెరలు క్రొత్త పెనఁగులాడు. 95

సీ. చిలుక బాపకోలంబుల బందుగులకెల్లఁ గలితామ్రఫలకోటిగ్రాసమొసఁగు
నెలదేఁటి రాచగుంపుల చుట్టములకెల్లఁ బలుసుఁదేనియ పల్లెబత్తెలొసఁగుఁ
జలిగాడ్పు కోమటి చాలుసజాతీయములకుఁ దావులసంచిమొదలొసంగుఁ
గోయిల నాలవకొలముదాయాదుల కేలఁ గోఁ జిగురాకు నేల యొసఁగు
కొమ్మల నెలవు సోలజాలమ్ములోనఁ, జిలుకసాంబ్రాణితేజీవజీరుఁ డనుపఁ
దాత్తెముప్పన వసంతుని రాణువెల్లఁ, గన్నగుర్రెడు కడుపుంజి గనుటకతన. 96

.. ఎకెలా పస్తాల దిల్యతేజిని జూనాయుంచాగఁ బల్మాలు బ

ల్విడి సంభ్రమసముత్కటతం జెలువు మేల్విల్లెక్కు డించంగ న
వ్వావవిలాసానికి దూరదేశగమనక్లేశవిశ్లిష్టమోహావల
జడిమాకంపితధైర్యసంపతిహరచ్చైత్రాదియాత్రారతిన్. 97

క. ఆతఁడేఁ దమి వెగ్గలమై, శాతోదరి పొగుల మిగుల జడిసి శరీర
ద్యోతకము లైన చిన్నెల, చేత న్విరహ మని తెలిసి చెలువలు తమలోన్. 98

సీ. ఆమెనమ్మ యిదేటి యాగడా లిదియేమి యెఱుఁగు నిన్నటి నేఁటి మెఱుఁగుబోఁడి
యెఱుఁగునా యనఁగూడ దిప్పు డిప్పుడు కొంత గడిదేఱలే నలకారివగల
గడిదేఱు కింక నెన్నఁడు మంచిమగవానిఁ గోరించు జవ్వనం బూఁటఁజేయ
జవ్వనం బౌనెకా చదువుకొన్నది గాన మనసు నిల్పఁగలేక మరులుకొనియెఁ
జెలువ యీబాము లనుభవించినను గాని, తెలియదే ప్రేగులోపలి తీఁట వంటి
వలపుకసిక్రొత్త లివి పగవారి కైన, వలదుగా దీని కిపుడేల వచ్చెనమ్మ. 99

చ. తడఁబడు మాట గద్గదిక వార్కొను నిల్చినచోట నిల్వరా
దడుగులఁ దొట్రుపాటు గదియంబడుఁ గంపము చెందు నిద్ర రా
దెవ్వని కోర్కి హెచ్చు మది సేమొ వితావిత జాలిజాలి యా
నడిగినఁ జెప్పఁగూడ దకటా మరులెత్తిన యాఁటదానికిన్. 100

క. ఇవి యన్నియుఁ జెలులారా, చివురాకుం బోఁడియందుఁ జెలువొందెడు ని
క్కువ మింతకు విరహమహో, దవ మేకార్ణవము మీఁదఁ దగ వెయ్యదియో! 101

మ. అతివా యింతకుమున్న నన్బిలిచె డాయంబోయితిం బోయిన
న్చెలివా యంచనె సేఁప కంటి సరోజీవాక్షి యే లెస్స నేఁ
డితఁగా నిన్ననె నేటికే చెలువ యంటి న్నావెత ల్నీకు స
మ్మతమా యన్న వితాకురాలయితి నమ్మా కొమ్మ యమ్మాటకున్. 102

క. అని దట్టుసేయు బోఁటులఁ, గనుసన్నలఁ గడకుఁ బోఁసఁగాఁ బనిచి సఖుం
జనవిచ్చి మనుపఁ గావున, నెనసినలిమి వనితఁ జేరి యొయ్యమునన్. 103

గీ. వచ్చి తడవాయెఁ గద మహీపాలమహిషిఁ
జూచిన ట్లాయెఁ గద యింక శోభనాంగి
పోవలవదె మనపురంబునకు మగిడి
తల్లిదండ్రులు కడుఁ దల్లడిల్లకుండ. 104

క. తెలిసె నిఁకఁ గొన్ని నాళ్ళు, యిటఁగల చెలువములు చూచ నిచటనె నిలుచా
దలఁచినకైనఁ జిన్నది, చెలివా మది లెస్స యట్లు చేయుమ వేమిఁ? 105

క. అనవిన్నఁ జూచి తలవాంచి, చిన నవ్వఁ జేసి యేమొ చింతాసంతా
పనిమూధిఁ జెందునంపము, గనఁబడియెడు నిట్టు లౌనొ కాదో యెఱుంగన్. 106

చ. సరసిజగంధి నీమది విచారము దోఁపఁగ వేఱొకండు లే
దరయఁగఁ గారణంబు నవయౌవనరూపకళావిలాసభా
స్వరుఁడగునట్టి యొక్కమగవానిపయిం గనువైచి తేమొ దు
స్తరతరచింతచే నదియె కానలయుం దలపోసి చూచినన్. 107

మ. బలభిన్నీలకచామణీ యిదియుఁ దప్పా కాంతులంగోరి కాం
తలు చింతింపరొ కంతుకుంతముల నంతల్నింపరో లేక నీ
తలనే పుట్టెనె యైన నేరమొకఁ జేతత్కార్య మాద్యంతముం
దెలియం బల్కకయుంట నీవలన నింతీ యంతనే వింతజే. 108

క. నావంటి బోఁటి గలుగం, గావగవఁగ నేల యెంతకార్యం బైన
న్నీవే కావలె నన్నుం, దైవకటాక్షమునఁ గరగతము సేయ వటే. 109

చ. అనవిని యాలతాంగి నగవామతిలన్నునుఁ జూచి భావజే
దినివి గదమ్మ నీకు నిఁకఁ దెల్పకయుండఁగ నేర్తునమ్మ నీ
యనువు మదీయఘోరవిపదబ్ధిఁ నోడ గదమ్మ వాఁడిమై
నొనరినకంతుతూపులకు నోడఁగదమ్మ యిఁకన్ వధూమణీ. 110

గీ. నాతి యెఱుఁగుదువా యల్లనాఁడు డేగఁ, జేత వహియించి చిన్న తేజీదువాలిఁ
గాఁగఁ దోలుచు నీత్రోవగానె చనియె, నామనసు వానివీఁపునె నాటెనమ్మ. 111

చ. కలకల నవ్వుమోము పురిగట్టిన నెమ్మియి నూగునూగు మీ
సలు నపరంజిడాలెగుబుజంబులు చక్కనిముక్కు తేటక
న్నులు నిడుసోగకన్బొమలు నెక్కిన గ్రక్కునఁ బాలుగాఱు చె
క్కులు నిసుమంతకాను తలుకుందొడలాస్యపమాళికే తగున్. 112

క. కనమో వినమో ఘనమో, ఘనమోహనమోదకారికచ మగవాని
దినముం భువనంబుల నా, మనము స్మరియించువాని మఱిగంటి మటే. 113

గీ. వనజలోచన నేనుగావలసినట్టి, దానవై తేని నెటులైన మానవేంద్రుఁ
గూర్చి నాప్రాణ మిపుడెత్తుకొమ్మ లేని, పక్షమైనను నామీఁదిబాళివిడుము 114

క. అని పలికి సొమ్మసిల్లినఁ, గని దీని మనంబు తెలిసెఁ గద యిఁకమీఁదన్
మనసిజుఁ డదయుఁడు శరమే, సిన నేమగునో పరాకు సేయుదమనుచున్. 115

గీ. ఎంతలే దింతి యిఁకనెమ్ము వంతయేల, యిందులకు నట్లె యొడఁగూర్చికొంద మబల

యప్పుడు నీచిత్తమే వచ్చు నిప్పుడు వట్టి, మాటలాడినఁ గలదమ్మ మానుమమ్మ. 116

క. కొమ్మలకుం బురుషులకుం, గమ్మని విలుకాఁడె వేల్పు గావున నతని
న్నెమ్మదిఁ గాఁ బూజింతము, రమ్మా యలకేలివనికి రాజీవముఖీ. 117

క. అని పలికి యేను నెచ్చెలు, లును మచ్చిక పెంపునవిలోలేక్షణఁ దో
డ్కొని వచ్చి కుసుమవిస్రమ, వనిఁ జొచ్చి రసార్ద్రవచనవైఖరి బెరయన్. 118

చ. అలనపుఁ జంచలాలియుతమై సుమనోహరచాపహారిస
ద్గలగతిమించి పాదపవికస్వరమై భవహారిమైన యీ
యలఘువనోల్లసన్మహత్త్వము నేమని చెప్పవచ్చునో
లలితలతాంగి కామితఫలంబు లొసంగుచుఁ బ్రోచునంచుఁ జెన్. 119

మ. పొలఁతీ యాపొన గున్నపొన్నవిరిరిం బూఁదేనె బల్కొల్వగా
యలరన్ సారెకు నెక్కుచుం దిగుచు చాలై దుమ్మెద ల్మించె ని
చ్చలపుం జాయలతావిజాజివిరి సేజాజోడు సైకొన్న క్రొం
దలుకుం బచ్చలమేడ దాఁపు జలయంత్రంబో యనం గంటివే. 120

మ. సరసాళు ల్మిన్నజగంధమానుచుఁ జరించంగుం భినీజాతము
ల్వారసుం జొట్టుఁ జెలంగుచుండఁగ మహావాలంబు కుంజాస్త్రిచేఁ
గర మొప్పార సుధాప్రభావమగుపుఙ్గాలి న్విదాహాత్రిప
స్ఫురితంబై విలసిల్లె నోయబల యీపున్నాగముం జూచితే. 121

చ. అరవిరి వెండిచెంబుల నయంబునఁ దేనియపానకంబు లేఁ
బరువగు గుజ్జుమావి చలిపందిరుల న్లతకూన లియ్యఁగా
నరుసునఁ గ్రోలియు న్సరసిజాస్త్రిగుణస్థితిఁ గండుదేఁటి ని
బ్బరముగు బాళిమై నధరపల్లవమంటుటఁ గంటివే చెలీ. 122

చ. హితగతినిందు బింబరుచు లింపుఘటింప మనోజకాంతసం
గతిఁ దగు కైరవారముల గర్వము మించె నధూటి కంటివే
హితగతి నిందుబింబరుచు లింపుఘటింప మనోజకాంతసం
గతిఁ దగు కైరవారముల గర్వము మించుట చోద్యమే చెలీ. 123

చ. తనతను వెల్లఁ జిక్కొని దక్షిణమారుతచోరకుండు నే
ర్పునఁ జనుఁ డెంచి తావిఁ గొనిపో వనదేవత పెంపుచిల్క క్రో
యని పెనుఁబోటుఁ గూఁత లిడుచట్టిగతి న్వినవయ్యె వింటివే
యనుపమగాత్రి కోకిలకులాకుల కేళి కుహూకుహూధ్వనుల్. 124

గీ. మేలితేనియనిండిన మెట్టతమ్మిఁ, జేరి కొలనాడి పుష్పాడిపేరి రక్ష
పొసఁగ నవ్వలిక్రొవ్విరిపురుటియిల్లు, వింతగాఁ జెందెఁ దేఁటి బాలెంత కంటె. 125

క. అనిలాలివిశతకేళీ, వనపాళీగరిమమోలి నర్తించుచుఁ గ్రొ
న్ననగుంపుఁ జిమ్ముచేమక, జనియింపఁ గడంగి సరసనగ్లాసములన్. 126



ప గ డ.

అతివరో చూచితె యలరెడి మావులు—జతగూడిన విరి చల్లనితావులు
వలరిపొదలివె యిటు రారాదటె—యేలపోయె దవ నింతనె వాదటె
చాలుచాలు నీసంపెగ మొల్లను—బాలకంటివే పాదిరిమొల్లను
నెంత రాఁగదే నిమ్మల నీడకు—పలుక నేలనే యంతటిప్రోడకు
ఎగిరి పడకులే యీకంకేలికిఁ—జిగురుచాలదే చెలి నీకేలికి
నాసలేటికే యంపని పొగడకు—వేసటలే కీవిరులను పొగడకు
పడఁతి రాకు నాపాలిటి పొన్నకు—ముడిచి డెరోసము మొన్నటిచిన్నకు
వాసంతికకై వచ్చెను చిన్నది—నోసమొఖుంగని తొయ్యలి నవ్వెను.
యీవిరవాదుల కేటికి ముచ్చట—తావులవిరికే తెలియకను మిచ్చట
నెఱసిన విరికంటివె వాసంతులు—యొఱుకలేదె నీకేటికి దంతులు
పొదలిదవచ్చటి పుష్పాడి తిన్నెలు—అదిగొకొనిరే యప్పుడె కన్నెలు
తెలివ దాఁటితే తేనియకాల్వలు—వెలనిరి నేఁడీవివ్వకుఁ జెల్వలు
సరసను మొలచెను జాలుగ మొల్లలు—దొరసెడు నచ్చటఁ దుమ్మెదపిల్లలు
బొండుమల్లెలి వెపొలఁతిరొమెచ్చితె—పంపలు కడువింతలుగా గ్రుచ్చితె
పలుకకు కోయిలపడువులు మూగెను—బొలఁతి వెలచితే పూఁబొద లోఁగెడు
వెలఁది చూడు కురువింపలయంపము—కెలఁకులఁ గడుఁ దొలఁగించె మరందము
సురపొన్నల కీసున వెన్నాడకు—తరుణి వెలతు నిత్తుజి నన్నాడకు
కోవిదారములకును వాదేటికి—నేనఁ గయ్యముల కేగెదు మాటికి
వనితలు బడలిన నగకనిపించెను—గొనకొని తుమ్మెదకోపములు ముంచెను. 127

వ. అని పుష్పాపచయంబు గావించి చాలించినంత. 128

క. మధురిమధురీణసవిధవి, వినమాధవికాప్రసూనవిస్ఫురమారం
దధునీమిథోవిహృతిమ, న్మగసుపథాళింపమందమారుత మొందెన్. 129

ఉ. మానవతుల్గనుంగొని రమందమరందనవారవింద్యం
దానుసరన్మిళింద నికరాంధుకబంధురగంధసాంద్రమం

దానిలమత్త సింధురవిహారవిలోలతరంగజాలడో
లానిశఖేలనాకలితహంసము నొక్కసరోవతంసమున్. 130

వ. ఇత్తెఱంగునం గనుంగొని జలమానవకుమారు లెమ్మెలకై చిమ్ముక్రొమ్మెఱుంగుఁజము దాడుల బెక్కునం బఱుక్కన నెగురునిడువాలువాలుఁగుపిల్లలకై నికటతటతరు పటలశాఖాశిఖానికరంబులనుండి దుముకు లకుముకులగరుత్తులం బెనుఁగు మరుత్తులం దొఱఁగు సరాగంబు లగుపరాగంబు లందగిలి యరవిందమందిరకుం దార్చినగందవొడియఱపెట్టెలచందంబున నీషదుచ్ఛలితరథాంగంబు లగుతరంగంబులసందున సదభ్రవిభ్రమంబునం దిరుగుజలభ్రమంబులం బగిలి నిగనిగనికెంపురాలు నింపిన గోముగను వామదగుంటలం బలపించుటకు శిరఃకంపనంబు సేయుచు జలబిందుసందోహకంపలితచిత్రశతపత్రపత్రసమావేల్లితం బగుహల్లకంబు వారిదేవత కెత్తుచురకతపాత్ర మౌక్తికారాత్రికంబుల డంబువిడంబింప నందులకు సోబనలువాఁడు ముత్తైదువుల చెలువున త్రోయు తేఁటినీటుకత్తియల తేటపాటలకుం జొక్కానోయన నాయకులతోడి పాలయలుకలం దొలంగి చని వనజకుడుంగంబులం గపటనిద్రాముద్రితలై చలితజలాంబులికలు సోఁకిన నులికిపడి యనునయింపం బతులేతెంచిరని బయలుజంకించు నీటుకత్తియల తేటపాటలకుం జొక్కానోయన నాయకులతోడి పాలయలుకలం దొలంగిచని వనజకుడుంగంబులం గపటనిద్రాముద్రితలై చలితజలాంబులికలుసోఁకిన నులికిపడియనునయింపం బతు లేతెంచిరని బయలు జంకించు జక్కవమించుబోఁడుల యలత్యుగ్రబహుతరాక్షేపంబుల పెల్లునకుం గొల్లన నవ్వుచుఁ బువ్వింటిసాది మవ్వంపుననిగేరు మారుతమానవునకుం దీరసంచారిశిఖావళీకుమారికాకేకారావంబు లను గద్దింపులం జఱుకు వొడమించి నడదిద్దునెడం బర్విన రజంబువిధంబున దుమారంబుగా నుప్పరం బెగయు పుప్పొడి పేరింట నుల్ల సిల్లు నుల్లసనీడలవీడుజోడాడు వేడుకలఁ గమలినీకమలబంధుపాణిగ్రహణంబునకుఁ గులదేవతల నెదురుకొనుచదురున లజ్జించుచు పుటసమంచితసకోరకబిసాగ్రపాలిక లగుచు వచ్చు మరాలికాబాలికలకలకలంబులసంగ్రమ్మికొని తమ్మిమేడలెక్కి పెక్కువగల దేఁకుచి కొమ్ములసందునం దొంగిచూచు మధుపానరోధ వధూమణుల మిథస్సమ్మర్దకలకోలాహలబాహుళ్యంబులకుం దగవు లూహించుచు నాళీకముకుళంబులను కలశకులంబులం బరికల్పించి నిస్తారసంపదం గలహంసదంపతులు పరిభ్రమసమాగమంబునం బుణ్యాహం బాచరించి యెదురు నూడం బొడసూపిన యజ్ఞాతప్రభాతం బగు నిశాసమయంబు విధంబునం దనరు పరిసరతరుచ్ఛాయామాయాంధకారంబునకుం దిగులువ

డి యప్పటప్పటికి వికసితాంబుజంబులం గనుంగొని యవియు ముకుళింపమిం బొం
గు రథాంగకామినుల వినోదంబులకు ఖేదమోదంబు లనుభవించుచుఁ జెంగటఁ జె
లంగు చెంగలువమాలెపై నంకించిపాడు పెక్కుల తేఁటిజక్కులవారియాలాపంబుల
లకుం బరిఫుల్లసరోజం బనుకామిన్నిఁ జేయవఁ బరఁగు విగళితప్రసవపరాగపరంపర య
నుపరిక్రముగ్గుల డగ్గఱ నంపం బగుమందమరుదాందోళితేందీవరము పైనుండి శివ
మాడు సారసవరారోహలకు సమీపంబున శైవాలకలాపంబు లనుధూపంబులర్పిం
చుచు మూఁగికొని యాగామికార్యంబు లడుగునమ్మలక్కులచందంబునం బొసంగు
నానావిధజలవిహంగమాంగనావ్యూహంబున కుత్సాహంబుఁ బొందుచుఁ గమలాక
రాభిధానంబుగానం గంకణవిరాజమానంబై పుష్కరస్వరూపంబు గావున రాజహం
సకలాపంబై శోభితరంగవిశాలంబు గావున శైలాగ్రప్రముఖానుకూలంబై సారం
గవిలసితంబు గావునఁ బద్మకరేణుభూషితంబై యొసంగుటకు నంతరంగంబున నా
నంద మంపుచుం జేరి. 131

సీ. వారు మీకును నొక్కనయసువారలు గాన నువిద వారికి మీకు నుద్ది యనుచు
నొడిసదానిపై నొడిసిన నేలికసానిపాదములపై నాన యనుచు
నాజతతోడ నేకాంతమాడితివి మాగుంపులో నీవుండఁ గూడ దనుచు
నంటిమి గాక మర్యాదతో నిల్చనే యప్పటికైనయట్లుగ నటంచు
బాలయులనాఁడు నామీఁద నోలవెట్టి, తెచ్చినిఁక మీఁదఁ జరియింపుమీ యటంచు
నందు కేమాయెఁ గాని లేవమ్మ యనుచుఁ, బలికికొంచును దెగలు గాఁ బంచికొనుచు.

మ. మెలఁతల్ తుమ్మెదకంటుకమ్మవిరిరుమ్మీ పాముపామూమ మా
టలతెబ్బిబ్బల కుల్కికీలుజడఁ గొట్టం బూను జేజేలయొ
జ్జలయిల్లాలని వ్రాసినట్టి వలువ ల్చాలించి యచ్చంపు ని
చ్చలఫుంజం దురుకావి పావడలు మించన్ ఖేలనాలోలలై 133

గీ. డాసి దరి నిల్వ వారినీడలు పొసంగె, నీటిలోఁ దమ్మిమేడల నీటు రోసి
తన్ముఖాంభోజముల నిల్వఁ దలఁచి వచ్చి, పద్మ తాల్చిన విశ్వరూపము లనంగ. 134

చ. సుదతులు బంతిగాఁ గొలనుఁ జొచ్చి చనంగఁ గ్రమక్రమంబునం
బదములు ముంచి పెందొడలఁ బైకొని పొక్కిట నాఁగి చక్రసం
పదలు సహింపలేని కుచభారము లోఁగొని కంఠదఘ్నమై
తుది నటు మించవయ్యె నలతోయము కంబులు నాఁగ మించుటన్. 135

మ. కొలనయ్యింతులు సొచ్చినంతరగ సోఁకుల్ హెచ్చిన స్వేఁగుఁ ద

మ్ములపైఁ దేఁటులు పేటుతామరలపై మూఁగం బదియాళికే
ఖలు వాటింగదుమంగఁ పధ్వనికి శేఁగం జక్కన ల్దాఁటు లె
క్కులఁ తేఁ జెమ్మెరపుష్పరాల్ చపలనాఁగం జిత్రమయ్యె న్వడిన్. 136

చ. చెలువ యొకర్తు క్రౌంచశుకఁ జెందొవ బిబ్బిగరంగనైవ న
య్యలరు తమాజలిం బకుట యద్భుత మయ్యె మదీయహస్తరే
ఖలఁ జెలరేఁగి గాసియుఁ గాఁ బగునే యని యెంచ దెంచి చే
తులపయి వ్రాలి వేఁడికొను తోయజబాంధవబింబమో యనన్. 137

గీ. సారసంచశైలమథితకాసారజలధి, నప్పడప్పుడు వొడము సజ్జారికరణి
నొకశుకాలాపమించి వెల్లకిల నీఁద, నమరె ముద్దులుగారు చిన్నారి మోము. 138

చ. ఎలమి నొకర్తు వెల్లకిల నీఁదఁగఁ జుట్టును గల్వమొగ్గల
గ్గలముగ మించెఁ జన్నుఁగవకాంతులు గగ్గొనవచ్చెఁ యుదా
ర్జలరుహగంధి పంపఁ బరిచారిక లచ్చట ముద్దుగాఁగ పొం
దులుగని నైచు నాటములతోడి కదానిగు దాఁచు ల్బలెన్. 139

గీ. మొగము మాత్రంబు కానరా ముద్దుగుమ్మ
యొకతె నిలు వీఁత యాఁడెఁ జెన్నొందెఁ గురులు
నీరజాకరమున నమ్ముసల్లటిలోఁ గ్రొ
పీటములు గ్రోలు మేఘంబు పిల్లయనఁగ. 140

క. బోఁదగిల నీఁదు నొక్కరుమి, టూరి వికలంకటకటీతటంబా పాపెక్
సారతరాపరపారా, వారావృత మైనభూమివలయం బనఁగన్. 141

గీ. బాలికలు మేలి జీనుసురాలనూడి, నీటికై జారు సొరు వన్నింపఁదగి యొ
పలమవాలనపై నపరంటు నేయు, నలుసువిలుకాని నునుదోనియమ్ములనఁగ. 142

సీ. చనుఁగవమీఁది చందనము చెందినచోటు వెలిదమ్మిపుష్పాదు గలసికొనఁగ
మెడల కుంకుమపచ్చ మించి మునిఁగినచోటు చెంగల్వవిరిగుంపు చేరికొనఁగ
సారఘనాసుచుటి కస్తూరి మాఁటినచోటు తేఁటిలేఁజవరాండ్రు మాటికొనఁగఁ
నెమ్మినిఁ బసుపువన్నియలు పన్నినచోటు నవకంపుటకరులు నాఁచికొనఁగఁ
జెలువ లీకరణి నీరాడి కొలను వెడలి, తమముఖాంభోజముల నిండు తావిఁ గ్రోలఁ
దేనియలు గ్రాయు కప్పురతేఁటులనఁగ, జలజకణములఁ గీలుఁగంటలు నెలంగ.

చ. తటమహిఁ జేరి యంతట మదాలసముం గయిసేసి తాము ను
త్కటమణిభూషణావళులు దాలిచి యేటిపరంకులొప్పుయి

క్కుటిలకచా శిఖామణికిఁ గోరుకు లిచ్చు రమాకుమారు నె
క్కుటిభజియింపకున్న నిది కార్యముగా దని యేగి యవ్వలన్. 144

ఉ. చెలువగు పూఁబొదన్ వలపు చల్లెడు కస్తురి తిన్నె యందుఁ గెం
దలిరుపఁరగిపీఁట పయిఁ దామరతూఁకునఁ జెంతనున్న నె
చ్చెలి మొగ మొరసేయ రతి చెక్కులు నొక్కుచు మోవి యానుచున్
గలరవ మిచ్చు పచ్చవిలుకాని లిఖించి సఖీశిఖామణుల్. 145

చ. అలిగిన మ్రొక్కి చుక్కజవరా లదలించుచుఁ గాలఁ దన్నినం
బులకలు దాల్చు చందురుని పొంకము వ్రాసి వసంతు మత్తకో
కిలములఁ దేఁటులం జిలుకగేస్తులఁ దెమ్మెరయాకతాయలన్
నిలిపి యమర్చి తెచ్చిన వనీకుసుమంబులు కుప్పవోయుచున్. 146

క. పూజించి చిలుక ముక్కి, తేజీదొరఁ గూర్చి వికచదీవ్యద్గంగా
రాజీవ నవమధుద్రవ, రాజీవరవైఖరీపరంపర దొరయన్. 147

మ. హిమరుగ్బాంధవ మంత్రహీనము క్రియాహీనంబు సద్భక్తిహీ
నము మత్కల్పితమైన యీనిఖిలనానానూనపూజావిధా
నము సంపూర్ణముగాఁ దలంచి దయనానందింపు నీవంటి దై
వము చిత్తంబున మెచ్చినం గలుగలేవా మన్మనోభీష్టముల్. 148

గీ. అరయ హరునంతవాఁడు త్వద్గురుశరాగ్ర, దళితపురదర్పుఁడై మహావరముతోడ
నబ్జశరపాలిఁ గని మూఁడి సావహించు, ననిన నీశౌర్యసార మేమనఁగవచ్చు. 149

క. దైవం బనిన న్నిన్నే, దైవము గాకింక నొకఁడు ధవళాత్ముల నా
శీవిషవిశిఖ శిఖార్తులఁ, గావింప న్వారలఁ గూర్పఁగా నెన్నఁడిఁకన్. 150

సీ. వేఁడి యౌఁగదవయ్య విహితశైత్యాంధ్యమంథరగంధవాహస్తనంధయంబు
వాఁడి యౌఁగదవయ్య వనజాతిసహజాతి మార్దవనవకౌసుమవ్రజంబు
చేఁదు చూపుఁ గదయ్య జితసుధామాధురీసారకీరారావగౌరవంబు
వింత సేయుఁ గదయ్య సంతతాత్యంతపోషితహంసకాంతానిషేవణంబు
కామినీకాముకులకు యోగప్రసక్తి, దక్కు మగునీకటాక్షము దప్పెనేని
గాన నిను గొల్చువారిచే కౌశలంబు, భవజయోన్నిద్రతారిణి పంచబాణ. 151

సీ. వీటిఁబుచ్చవె దాసవిభుకన్యఁ గను బరాశరమౌనివరు సదాచారగరిమ
బైట వైచవె బృహస్పతిభార్యఁ గనుఁగొన్న తారకాకామినీధవుని గుట్టు
నగడు సేయవె యహల్యాకాంతఁ జూచిన యమరలోకాధినాయకుని నడత

కావ వానర్పవె కూర్మికూఁతు నీక్షించి యుబ్బినపద్మసంభవు పెద్దతనము
భావభవ యమ్మచెల్లగా నీవుచేత, నేఁజ బట్టిన నెవ్వారు నిలుచువారు
మారమణి నింతయేఁచిన యాబుతధ్వ, జేంద్రుఁ జెనకంగఁ జాల నదేమొకాని. 152

క. మారామపట్ల నీసుష, మారాజచ్ఛరము దాఁపుమా రాజ యిదే
మారాటమునకు నోర్వను, మారాజముఖీమణీకుమారా మారా. 153

క. అని మగిన యపుడు మగుడం, బనివడి పొగడె న్మధాంధపాంథజిగీపా
తనుతత్తురంగహేపా, ఘనతరఘోపాప్తి యొదవఁగాఁ గలఁగుటయున్. 154

శా. చీనాచక్కెర ఖాణపుంబులుఁగుఁ దేజీజోదుకేవంగి బ
ల్నానాకత్తికిఁ దత్తరిల్లి నవలా సాయంసమారంభవే
లానాలీకిని లీల సొమ్మసిల బాలాపాలికల్ చంద్రకాం
తానర్ఘాంతికవేదిఁ జేర్చి బహుచింతాకంపితస్వాంతులై. 155

సీ. మదనుగుణధ్వనికిఁ బొదలెదు తేఁటులే మంచకింకను ఝుంకరించఁ దొడఁగె
మానసప్రేమ యేమఅని రాయంచలే మించికొంకక హుంకరించఁ దొడఁగె
సహకారవృత్తిచే జరగు రాచిల్కలే కొంచకిక్కడ వెక్కిరించఁ దొడఁగె
ఘనమైత్రిచే నెమ్మిగను నెమ్మిగుంపులే ధృతియింకఁగా హుంకరించఁ దొడఁగె
నేమిచేయుదుమే బోఁటి యింకనేటి, మాటలే పోటుమదనకు మగువమీఁద
నింతిపగయేల బాలవాఁడేమి చేయు, మనలపాపంబు పొలియింప ననుచు మఱియు.

ఉ. కొమ్మ చిగుళ్లు దెమ్మ లతకూన విరుల్గొనిరమ్మ పద్మినీ
తమ్ములు గొంచురమ్మ వనితామణికి న్ననశీతలోపచా
రమ్మొనరించవున్న నలరాయని రాయడి నేమి పుట్టునో
యమ్మకచెల్ల యింకఁ దడయం బనిలే దని సంభ్రమంబునన్. 157

సీ. అడుగునఁ బడవైచి రని దళం బెత్తునో నెత్తమ్మి పదముల నిలుపనేల
యంకంబునకుఁ దార్చి రని పొరవిచ్చునో యనఁటు లూరులచెంత నునుపనేల
యధరభూమిని నిల్పిరని మొనచూపునో చిగురాకు కెమ్మోవిఁ జేర్ప నేల
యంబకమ్ముల నుంచి రని యెట్టువాలునో హల్లకంబత్తుల నలమనేల
యిచట సమవస్తుసంయోగమేల యమ్మ, యిదియుఁ బగవాని సేనసీయిగురుఁబోణి
తాళలే దమ్మ మీనేర్పు చాలునమ్మ, తరుణియివి యెల్ల మదనసాధనములమ్మ. 156

క. అనుచుఁ బెనఁగొన్నశైత్యక, మునఁ దగు శిశిరోపచారములు చేయుటయుం
మనసిజశిఖి బగ్గురుమన, నెనరునఁ దల్లడిలుచుండె నెగ్గున నాఁగన్. 158

సీ. తనులతవీఁచ జివ్వనఁకి మిహికాంబుకాండ మెంతయు నిరాకార మయ్యె
నఁచేతిపైఁ జుఱచుఱ స్రుక్కియుంపందఁ గెందమ్మి పుష్కరాకృతి వహించెఁ
గలికి కన్నులమీఁదఁ గమలిన పరువంపు ననగుత్తు లరయ సూనంబు లయ్యె
మినుకుఁ జందోయిపైఁ దునిసి మౌక్తికరాశి తిలకింప ముత్తెంపు తెరలువ్రానె
బళిర యివియెల్లఁ దమపాటు దలఁప కిప్పు, డంగజాగ్నికి సాహాయ్య మాచరించి
కొమ్మపై వేఁడి చూపె నాకమ్మవింటి, యెమ్మెకానికి విజయకాలము సుమ్మ. 158

గీ. ఆదియుఁ గాకిందుఁ జనుదెంచునపుడు తమ్మి, విరుల దగుకమ్మదెమ్మెరల్ వీచెనమ్మ
నైకొనక వచ్చినంతయుఁ గంటిమమ్మ, యబలనిం దుండనీయరా దమ్మయనుచు. 160

క. ఇందీవరలోచన లిం, దిందిరకచ సేవ దేర్చి తెచ్చిరి సుషమా
కందళితైందవరుచిగరి, మందిరమగుధవళవసనమందిరమునకున్. 161

గీ. ఇట్లు చెలువలు దోడ్కొని యేగుదేర, నంబుజాననతనగు డారంబుఁ జేరె
ననిన జైమినిముని యావిహంగములన, నంతర కథావిధం బెట్టిదని యడిగిన. 162

శా. లక్ష్మీశోపమ వీరవేంకటనృపాలశ్రీమహారాయ ద
త్తక్ష్మామండల మండనాయిత యశోదామాభిరామాఁకుశ్రీ
రక్ష్మానతఘన కార్తికీకుముదినీప్రాణేశ చారుప్రకా
శక్ష్మాలత్ప్రతిపక్షభూమిపతియోషాలోచనాంభోరుహా. 163

క. ధాటీఘోటీఖురఖుర, కోటీపాటితవిరోధికుతలపతిశిరః
కోటీరహారశకలవ, ధూటీనవమదన విభవధూర్వహసదనా. 164

పంచచామరము.

వదావదాహిభోగిరత్న వర్ణవర్ణితక్షమాం, గదాగదాసిమద్విరోధిఖండనాత్తలోకస
మ్మదా మదావళారివిక్రమస్ఫురద్యశఃకలా, పదాపదానవద్రుమలోకపారిజాతవైభవా.




ఇది శ్రీమన్మదనగోపాలకటాక్షవీక్షణాసమాసాదిత సరసకవితావైభవ సవరమన్వయా
భరణ నారాయణభూపాలతనూభవ శఠగోపతాపసేంద్రచరణారవింద సంచలన్మా
నసమిళింద సంతతభారతభాగవతాదిశ్రవణానంద కామినీమనోహరరూపరేఖావిజి
తచైత్రకాశ్యపగోత్రపవిత్ర జాతివార్తాకవిజనామోదసంధాయక చిననారాయణనా
యకప్రణీతంబైనకువలయాశ్వచరిత్రంబనుమహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము



శ్రీరస్తు.

# కువలయాశ్వచరిత్రము.

## చతుర్థాశ్వాసము.

---

క. శ్రీరాజద్వేంకటగిరి, శౌరిపదాంభోజభజనజనితోజ్జ్వలతో
దారవిభవేంద్ర సవరము, నారాయణభూపచంద్రనయగుణసాంద్రా. 1

గీ. అవధరింపుము జైమిని కలపతంగ, కులపతంగంబు లిట్లని తెలుపఁదొడఁగె
నమ్మదాలస పటకుటీరంబుదారి, కమ్మతావుల తెమ్మెరల్గ్రమ్ముదారి. 2

క. వనిసొచ్చుట మరునకున, ర్పన లిచ్చుట సొమ్మసిల్లి సఖియలవలనం
గనువిచ్చుట వారచటికిఁ, జనుదెంచుట యెఱుఁగలేక తన్మయదశచేన్. 3

సీ. మనవులు విన్నవించిన వినునోయంచుఁ జేరుకన్నియమిన్న చిన్నఁబోవ
ననబంతి కానుకిచ్చినఁ జూచునోయంచు వచ్చునెచ్చెలి తలవంచికొనఁగఁ
నెనరుతో హెచ్చరించినఁ బల్కునోయంచుఁ గదియు పైదలి సిగ్గుగాంచి యొదుగ
గనపించి జాతిచెప్పిన నవ్వునోయంచు నరుదెంచుహరిణాక్షి యవలి కరుగ
వినక చూడక పలుకక వేదనాప్తి, నవ్వకాపద్మనయన కాంతవశరాగ్ని
తప్తకిసలయముక్తనూతనపునఃప్ర, వాళకృతశయ్యఁ బొరలాడు వేళయందు. 4

ఉ. ఈవనజాయతాక్షిఁ దరుణేక్షుధనుష్కతురుష్కమాళి యా
హా వెతవెట్టెనంచు హృదయార్ద్రదయాభ్యుదయాప్తి చేత రా
జీవశరప్రహారగతిఁ జెందుట తెల్పఁగ నేగె నాఁగ నం
గావిభుఁ జేరెఁ గింశుకనఖద్యుతిఁ జొత్తిలి మిత్రుఁ డయ్యెడన్. 5

శా. ఛాయాప్రాగవకర్షణంబు సరసీజాతాంతభోగంబు కా
లాయానీకపతంగపాకపితృజాలప్రాప్తి పాంథప్రజా
స్థేయస్థానగతిప్రబోధకము దూతీప్రార్థనారూఢజా
రాయత్నంబు జరన్మహాతప ముదారంబయ్యె నంతంతకున్. 6

చ. వడి నపరాద్రిఁ జెంద నని వాసిగఁ బద్మిని నెత్తిమీఁదఁ జే
యిడి కరసంగతి న్సమయమేగఁ దదాశఁ గుఱించి రాగమే
ర్పడఁగఁ జనంగఁ దేజమెడఁ బాయఁడె యీయినుఁ డంచుఁ బ్రోఁత పె
ల్లడరఁగఁ జాటుచూటి సరసాళిరుతు ల్మొఱసెం గొలంకులన్. 7

చ. అవిరళనిర్గళన్మకరసాంద్రనిబద్ధ నిజానుబింబకై
తవమున పోలి కాలవశత న్నిజపద్మగృహంబుఁ జేర మా
ధవపద మాటచే రమ మదభ్రమరాళితమంబు వాసి వెం
దవులక యుండఁగాఁ దలుపుదార్చె ననన్ముకుళించెఁ బద్మముల్. 8

ఉ. ఏకరథాంగభావము వహించిన నన్నిటు డించి పోవుట
ల్నీకుచితంబు గాదయిన నీవలె నేనును నీరధిప్రవే
శాకలనంబు గాంతు ననునాకృతి భానుని దేఁచూచుచుం
గోకము బాష్పవార్ధి సమకొల్పె భవిష్యవియోగఖిన్నమై. 9

ఉ. ఎంతయు బాడబంబు తనయింటికడం జెలువొందు జీవనం
బంతయుఁ గొల్లలాడ భువనావనశాలివి నీవుపేక్ష గ
న్నింతువె యంచుఁ బాశి మొఱ వెట్టగఁ జక్రము దానిపై రమా
కాంతుఁడు నైచెనో యన వికర్తనుఁ డయ్యెడఁ గ్రుంకె వార్ధిలోన్. 10

చ. కరముల బల్మిచే మెఱయు కంజహితుం డను మేటిజెట్టితో
నరుమగఁ బోరిపోరి సమయప్రతిమల్లకులేంద్రుఁ డాతనిన్
హరువుగఁ ద్రోచి మేనిచెమటూరఁగఁ దాల్చిన యెఱ్ఱమట్టినాఁ
గరమనరెం బ్రవాళరుచిగంధసురంధరసాంధ్యరాగముల్. 11

సీ. రవి గ్రుంక ముకుళించు రాజీవములఁ బాసి గమిగూడు తుమ్మెదకదుపనంగ
విభునిఁ గానక భూమి వెదకనేతెంచి చొప్పడు చాయ విశ్వరూపం బనంగఁ
దొగ నంటు సోమాఖ్య నెగడి రాఁగలఁడంచు గుమిగొన్న తామసగుణ మనంగ
రేకొన్న పతిరాక కైకొన్న ఘటియింపఁ గొనవిప్ప కురులడాల్గుంపనంగ
కాముకాగమనప్రతీక్షాపరాయ, ణోత్పలాక్షీజనాంజనవ్యాధవిస్మ
రాయతాక్షీణనవవీక్షణౌఘమనఁగఁ, బండిచీఁకటితెంపంబు మెండుకొనియె. 12

సీ. నటమద్గ్రథకాన్తనినాదభిన్నాంతరిక్షమునఁ దాల్చిన వెండి కట్లనంగ
జవమందమందగంధవహాప్తి మింటిపై రాలు వేలుప్రమాని పూలనంగ
యామినీవిధువివాహమున కంబరవేది వరలు ముత్తెపురంగవల్లు లనఁగఁ
దమపుష్కరాభిఖ్యతథ్యంబు గా వియత్పథము చెందిన వెల్లవమ్ములనఁగ
సమయమనుయాత్ర నాళీకసార్వభౌముఁ, డంబుజంబులఁ జెందురోలంబపఙ్క్తి
యనుతుపాకిని గగనలక్ష్యంబు నైనఁ, దగులు సీసంపుగుండ్లునాఁ దార లమరె. 13

క. అలపానుపుగట్టు నగరు, న్వెలునదురాజునకు ద్రోల వేళాసతి మె

చ్చులకుచ్చుఁ బట్టివైచిన, వెలిపావడ యనఁగఁ దూర్పు వెలుఁగం బాఱెన్. 15
సీ. తనభానుసంతతి ధరమీఁద వెలయింప భువిఁగాధిపతి గురస్ఫురణఁ బెంప
రహిఁ బాపమహిమచే జాతినాతి నొనర్ప నభవోగ్రధర్మ మొప్పారఁ జేయ
మానిత ధరణిజాతానంద మొనరింపఁ బాంథరామాత్మదర్పంబు లడఁప
వనభూరికమలవర్గమ్మాప్తిఁ దాయింపఁ దారేశరూఢివర్ధన మొనర్పఁ
జేసె రాయనిగర్వంబు గాచుపింప, సమధిక పలాశపరచక్రసమితి నొంచ
నమితకువలయపరిపాలనము మెఱఁగఁ, దూర్పుదెస రామచంద్రుఁడు తోఁచెనపుడు.
• ప్రాగ్దిశాంగన కెంగేలఁ బట్టినట్టి, పురుతకాల్పట్టుగవిసెన పొమువు వలన
నందమొందిన నిద్దంపుటద్దమనఁగఁ, బొడుపుఁగెంపున జాబిల్లి పొడిచె నపుడు. 17
చ. అమలిన శుక్లపక్షమెనయందగు తద్ద్విజరాజు మించి భే
దము సవరించి తేర్చు తెలితల్కులపాలనఁ బాంథదేహపాం
డిమబలెఁ జంద్రిక ల్నిగిడె డించిన నీరనఁ గాము కాత్మమో
హమువలె నంధకారనివహం బది యెక్కడనో యడంగఁగన్. 18
క. ఆకరణిఁ బొలుచు హృదయ, వ్యాకులతాతాపకారి యగు కోకారిం
జేకూరిన వగ వేఱుపు, రాకూరిమిపట్టి యబ్బరంబుగఁ బలికెన్. 19
మ. ననరొందం ద్విజరాజుగా యితఁడు పోనీ యంచు నే నూరకుం
డిన నీ వెంచక యేతు వే యిటులఁ గానీ మంచిదే చంద్ర నా
నుచువాలుంజడ చిల్వరాయనికి నిన్ను న్మేఁతగావింతురా
వినురా యేటికిపరాకురా కుసుమధన్విం గూడి వే రాకురా. 20
గీ. అమృతరామకమండలు హరిణకృత్తి, కాసమన్వితు నుద్దండ కరుని నిన్నుఁ
గన్న సన్న్యాసిగతి దోఁచుచున్నదరయ, గగనమధ్యాభియుక్తి నీకగునె చంద్ర.
గీ. శరధిఁదోఁచుట నాళీకపరవిధంబు, గోరికాంచుటయును మ్రోయుగుణముగల్గు
వింటనంటుట మమ్మేఁచుచుంట తెలిసె, నేయువారలఁ గానమో తోయజారి 22
క. నళినాప్తువలన మండల, కలితుఁడవై వెలయుటెల్లఁ గలిగిన కరణిం
దలఁతువె శంబరహారికిఁ, గలదే యుపకారమెందుఁ గమలకులారీ. 23
సీ. నినుఁ గడుపారఁ గాంచినవారిరాశికిఁ గడలేనిపాటులు గాంచవలసె
నిను నారికోరి కైకొను కల్వచెల్వకు విషములోఁ బ్రతుకుఁ గావింపవలసె
నినుఁ దలమీఁదఁ దాల్చిన శూలపాణికి నవిభవోపేతుఁడై యమరవలసె
నిను నమ్మి కొల్చి నిల్చిన తారకాళికిఁ జింతింప దుఃఖంబు చెందవలసె

నెవ్వరికి మంచివాఁడ విల్లెంచి చూడ, నించువిలుకాని కొక్కనికేమొకాని
వానిప్రథమాస్త్రి విఘనంబు వారి కొనవె, రాదు నీచెల్మి చేయఁ దారాసహాయ. 24
గీ. పాంథమదఖండనోద్దండపక్ష్మకాండ, గర్వసాహాయ్యకలయొందు గన్న నీకు
నమరభోజ్యకళల్గలవంద్రుఁడు లోకు, లొకటికిఁ బదాఱు గల్పించి యుత్పలాప్త. 25
గీ. అనుచు రామాలలామ పాంథాతిభీమ, ధామచయసీమ యగుచంద్రమామఁ గినిసి
వినిశితాంభోజనారాచమెనసి యేఁచు, మనసిజు గుతించి కొనుచు నిట్లనుచుఁ బలికె.
గీ. అబ్జవైరి నీతండ్రి యైనగరుడ, గమనకేళికిఁ గుండెలోగాల మింత
కొదవలే నీదుతల్లికిఁ గొంప చెఱుప, వీసితోఁ గూడి యేఁచకు విషమబాణ. 27
చ. కమలశరా నినుం జెఱపఁగా నియమించినఁ జేరియూఁడుగా
శ్శ్రముసలి కావునం దయలలాట విలోచనకేలి నిన్ను ని
క్కముగఁ గరంచెనుండె ననికాదె గిరీంద్రకుమారికావరుం
డమలినమంత్రదక్షసవనావని నాతనిఁ బాఱఁ ద్రోలుటల్. 28
సీ. భామానిరూఢి గన్పడ మండలాగ్రంబు మెఱయించు మొదట నీమేనమామ
కొమ్మలపైఁ బండ్లుకొఱికి లావులనల్లఘాటి కన్పించు నీఘోటకంబు
కాంతాళిపైఁ బరాగస్ఫూర్తిఁ గల్పించి చెనకంగఁ జూచు నీచికిలితూపు
నారులమ్రోఁత నానందించి నిలువెల్లఁ గన్నులు దాల్చు నీకార్ముకంబు
బళిబళీ నీకు బాకైన తలిరుటాకు, లడవి లతకూనలన్నఁ బైనంటి నిలుచు
నీవు మామీఁద శౌర్యంబు నెఱపుటరుదె, మానినీప్రాణచోర రమాకుమార. 29
చ. వనజకృపాణ చల్లనయినర్తిలఁగాఁ దడిపాఁత గొంతు గో
సినగతిఁ దమ్మివాలు గొని చిమ్మెదు పాంథులమీఁదఁ దేనెఁబూ
సిన పెనుఁగత్తి కానలయుఁ జేతి? నీకది విప్రయోగమొం
దినయల ముద్దియం దగిలి నెయ్యపుఁ జూపఁగ నెట్టు లోర్చితో. 30
గీ. అనుచుఁ జెల్వపుఁ జెంగల్వయరిదికిరుసు, దురుసుమాష్టిని బదరి యియ్యురుసుపట్టి
గురుసుమద్యోతనునిదూఱి గరుసుమీఱి, పేరెములువారెడు మరుత్కుమారు ననియె.
సీ. మెడలపై నిడలేక పడగలు చదిసిపో మేదిని భారమై మెఱయుఁ గాత
గట్టిగా నూపిరికట్టు పట్టంగ నాళీకనాభుఁడు పవ్వళించుఁ గాత
నాభీలపాతాలమైనను జొరఁబాఱి పిల్చి తార్క్ష్యుండు నొప్పించుఁ గాతఁ
గృత్తియైన భాష్యఫక్కికయందు నొకమాట తగుచుట్టుఁ బ్రోవమై తాఁకుఁ గాత
ప్రబలపన్నగకులరాజ్యపట్టభద్రుఁ, డెన్నఁ పసమీర నొకప్రక్క నిన్ను మెసవి

లేఁడు పొమ్మని యనకున్న వాఁడు గాన, పళితపాంథవిహార శీతలసమీర. 32

క. కదుఁ దాత్పర్యము నాపై, నిడుతామరసాక్షితోడి యీనెయ్యంబు
వ్విడు కారింపకు మదిఁ, జెందెడుతాలిమి నొక్కవిడుత తెమ్మెరబుడుతా. 33

గీ. అనుచు నిక్కాంత వలవంతఁ బొంచిపేఁడి, దొరలఁ జెందిన కమ్మదెమ్మెరల దూఱి
ముమ్మరమ్మగు తాపమ్ము గ్రమ్మఁదమ్మి, సానుపున సొమ్మసిల్లుచు మేను సేర్ప. 34

ఉ. ఏను మనంబులోనఁ జెలు లింప ఱలంతలఁ జెందిడంచు
నప్పానుపునందు నిక్కలికిప్రక్కనె యుంచుక పవ్వళించు న
చ్చోనిఁక నేమి తెల్పుదు యశోధన కోలలఁ గొట్టి లేపిన
స్మై నెఱుఁగంగనీ కొపవె నిద్దుర యిద్దురవస్థకై వెసన్. 35

ఉ. అంతట మేలుకాంచి నయనాబ్జము లొయ్యన విచ్చిచూడ ని
క్కాంతయు నేను నిష్కుధరగహ్వరపట్టనరాజగేహసౌ
ధాంతమునందు నుంటిమి మహాత్మక యిప్పు డిదేమొ యంచు మే
మెంతయుఁ జింత నంత గుఱియింప భయంపడి యున్న గ్రక్కునన్. 36

క. పాతాళకేతుఁ డంట యొక, దైతేయుఁడు చేరవచ్చి పంభోళిహటా
త్పాతాద్రిభీకహరిణీ, రీతింపగు మమ్ముఁ జూచి కృతహాసముతోన్. 37

క. లోకములన్నియు నన్నుం, గైకొని పూజించు మీరుగామీరానా
శీకాంబకుఁ బూజించితి, రాకామినులార నాకరం బెఱుఁగరొకో. 38

గీ. ఇప్పు డేమయ్యె నింక నాయించువింటి, వాఁడనుఁగు నేఁడు గూర్చి మీవాంఛదీర్ప
నేర్చునో నేరడో చూచి నెఱఁతలార, యింపుపసలార నన్నుఁ బూజింపుఁ డనుచు.

క. ఒక హెగ్గడి దానవనా, యకుతో నేమేమొ తెలిపి యాతఁడు వికట
భ్రుకుటీపటుతరనిటల, ప్రకటీకృతరోషుఁడై సభాస్థలికరుగన్. 40

క. ఆవచ్చిన చెలి నాతో, నేవగల ఋతధ్వజేంద్రుఁ డితనిం జంపం
గావిడిసినాఁడు బ్రదికితి, రీవేళకుఁ దాళుఁ డనుచు నేగన్వేగన్. 41

గీ. నాఁటనుండియు వలవంత నాట నీవ, ధూటి పడుపాటు కనుచు దోధూయమాన
మానసాంభోజనై యున్నదానవయ్య, యనఘ నాపేరు కుండల యంద్రు సురలు.

వ. మహాత్మా! యిది మదీయవృత్తాంతంబు దురంతసంతాపచింతాపరాయత్తం బగు చిత్తంబు వివరింప భవత్కథాకథనంబున కడ్డంబుగా నింతయు విన్నవించితి నీయపరాధంబునకుం బ్రార్థనారంజకంబగు నంజలిరచియించెద నాఁడు ఋతధ్వజవసుంధరాపురందరు దారుణం జూచుటం జేసి నిర్ధారణాసామర్థ్యంబు లేమిం జేసి డోలా

యమానమానసనై యున్నదానఁగాని నీయుంపలి సౌందర్యగాంభీర్యాదిగుణంబులు సోయంప్రత్యభిజ్ఞావిధాయకంబులై యున్నయవి. అయినను మద్విలోచనచకోరికాచంద్రబింబంబగు నీమూర్తియుం బోలె యుష్మద్వృత్తాంతంబుఁ గూడ మన్మనఃకమలంబునకు మార్తాండమండలంబుగా నానతీయ నవధరింపుము.

చ. అన విని యాజనాననగుణావని యావనితాశిరోమణిం
గనుఁగొని యింత నేర్పరివి గాక యయుండిన నీవధూటి కిం
పెనయ వయస్య వౌదువె భళీయిటువచ్చెను రాక్షసాధముం
డునుమ ఋతధ్వజుం డనవుడున్ భవదూహఁ దప్ప గల్గునే. 44

క. నాకోరికతో నీక, న్యాకాంక్షిత మెల్ల సఫల మయ్యెం దివిష
ద్భీకరుఁ డీదనుజుఁడు ఘో, రాకారతఁ గూలె మచ్ఛరావళిచేతన్. 45

గీ. అదియు నెఱుఁగుదు వింక నేణాంకవదన, మంజువాణియు నేను నీమాటలోని
వారమైతిమి మాకు నేదారి నడువ, వలయునో యట్లు నడిపింపు పలుకులేల. 46

చ. అనవుడు నమ్మదాలస ముఖాబ్జమునం జిఱునవ్వువెన్నెలల్
నునుఁ జనుదోయిపైఁ బులకలున్ నిటలంబున ఘర్మబిందువుల్
మనమున సిగ్గుఁ గన్నుఁగొనలం బ్రవహించు ముదశ్రుపూరముల్
కనఁబడ నున్నఁ జూచి చెలికత్తియ యత్తఱి రాజచంద్రుతోన్. 47

చ. ఇపుడు గదా మదాళి పయి నెత్తిన వింటిపయిం జెలంగు నం
దపువిరిదమ్మితూపు దెసనాదొరకేల్ రతి నిబ్బరంపు సి
బ్బపు వలిగబ్బిగుబ్బకవపై జెరలాడఁ దొడంగె నేఁడుమా
తపముఫలించె నింక వసుధావర తామస మేటికియ్యెడన్. 48

సీ. వేఁడిసెగల్గల్గువేల్పు సాకిరియైన యప్పుడు గాని కేలంటరాదు
ప్రామిన్కుఱాపలు గన్పడఁ గంటెకట్టునప్పుడుగాని గళియుక్తిఁ బొందరాదు
పొలుపుగా వ్రేలిమి బొట్టుమరించునప్పుడుగాని ముంగురుల్ పొదువరాదు
మొకమోరసేయ సన్నికలు మెట్టించునప్పుడుగాని పాదాప్తిఁ బొరయరాదు
నృష్టదంపతులకు విడెమిచ్చుమోప, మెనయునప్పుడుగాని పాన్పెక్కరాదు
నీవెఱుంగవె శాస్త్రోక్తి నిర్ణయంబు, చారుము లుదారకుంభినీజంభవైరి. 49

ఉ. ఏను వచింప నీవు వినుటిప్పుడ కాయిఁకమీఁద నీసరో
జానన యొక్కవేళఁ బొలయల్కఁ బరాఙ్ముఖ యున్నయప్పుడే
మౌనముఁ బిల్లు పెద్దతనముం గనినప్పటికైన నీగుపా

దానతి నాకుఁ బోఁటియయి యప్పుడె యప్పని నేర్పఁగఁడు నే. 50

సీ. రాచిల్క రాయబారమున దారికిరాక చడ్డింపు కోరమీసములు గువ్వి
యదిగా పనుచు నింతటంతటఁ జేరరాఁ గేడింపబిట్టుగాఁ గేకసైచి
నీ బంట నన్న మన్నించ వేయన విని వినమి సేయుచు దుంటవిల్లునంచి
దుడుకుగాఁ జెఱగంటి ముడిగొన్న బొమ్మలానించి చూచిన తెగనింపఁ దీసి
యతనుఁ డీయింతికలుక చల్లార్ప నీవు, పాదముల వ్రాల దీనబాష్పములు చూచి
యస్త్రసన్న్యాస మొనరించు నట్లుగాఁగ, నింపుసొంపారఁగా విహరింపుఁడింక,

గీ. అనిన మునమంది యమ్మందరాద్రి ధీరుఁ, డావధూటులఁ దోడ్కొని యాత్మపురికి
నరుగుటయ కాని లేదు కార్యం బటంచు, నగవుదైవాఱఁ గుండలమొగము చూచి.

క. మంచిది మనపురిఁ జేరుద, మంచు న్లేచుటయు నవ్వయస్యయుఁ గమ్మల్
మించుగ నసియాడఁగ భదుఁ, డంచుం జేఁజాపి మందహాసముతోడన్. 53

చ. చెలువుని వెంటఁబోఁ దరువు సేయు మనోజ్ఞము మాట చెల్లనీ
కలమెడు లజ్జకన్న ఘనమైన కటిక్రేతటి ప్రేఁగున న్నెడ
న్బైకఁగ నంచబిత్తరినలె న్మరిపంబున నమ్మదాలసా
జలరుహగంధి రా న్నృపతిచంద్రుని వెంబడి మేడ డిగ్గినన్. 54

మ. అతఁ డచ్చోఁ దురగంబు నెక్కి హృదయాబ్జాపూర్ణమోదార్ణవాం
చితుఁడై వారల వెన్క నుంచుకొని యక్షీణైక్యమాణిక్య దీ
ధితిజాతావృతదిగ్వితాన మగు దైతేయాధినాథాయతా
యతనం బల్లన నిర్గమించి పురబాహ్యక్షోణి కేతెంచుచున్. 55

ఉ. అచ్చట నున్న సైన్యము బలాధిపతు ల్వెనువెంటరా సము
ద్యచ్చటులార్భటిం గువలయాశ్వుఁడు ధ్వాని చౌకుచేసిన్
ప్రోచ్ఛలితావనీరజము లొక్క మొగంబుగఁ బిక్కటిల్లి వై
యచ్చరవీథిఁ గప్ప నదియాత్మపురాంగణసీమఁ జేరినన్. 56

గీ. అచటి కెదురుగవచ్చు ధరాధిపతులు, కామినీయుక్తుఁడై చేర క్రమ మెఱింగి
దవ్వులనె నిల్వ నిజమణిధామ మొంది, రమణులును దాను నంతఃపురమున కరిగె.

ఉ. అంతట నాసురాంతకుని యర్మిలితమ్ముఁడు తాళకేతుఁ డ
త్యంతమహోగ్రహాముఖక హాకహనాదమహాట్టహాసవి
భ్రాంతసమీకశోకపరిపాకభయాకరదైకలోకదు
ర్దాంతవిరక్తవేదనదారితకేశవుఁ డొక్కయిమ్మునన్. 58

చ. కొలువునుండి యింద్రుకడకు న్మన మంపినవాఁడువచ్చినా
పిలువు మటన్న వేత్రధరబృందము తోకొనితెచ్చి మంగల
న్నిలిపిన వాఁడు భీతియు వినీతియుఁ దోఁప దురాపకోపచా
పలమున హుంకరించు నిజభర్తకుఁ గేలు మొగిడ్చి యిట్లనున్. 59

క. దేవర ప్రతాపగరిమకు, నేవెఱతుం గాని నిర్జరేంద్రుఁడు వెఱవం
డావంతయైన నిపుడే, మోవింతలుపుట్టె దనుజమూర్ధన్యమణీ. 60

సీ. దొరకాపురైతె కావ్యసరణిఁ దెల్పెడి కవీశ్వరులకు లంచపంచంబు లొసఁగి
సమ్ముఖమ్మననుండి చనుదెంచు నల్లవాయసమువారి కాళపాశలు ఘటించి
బోనవెచ్చము గొంచుఁబోవు శచీదేవిదాదులకును బరిధాన మిచ్చి
పిలువ నేతెంచు వేగులవారి వెంటనే యరుగు నియోగుల ననుసరించి
కినిసి వాకిటివా రడ్డగించుకతన, నేనువచ్చినమాట దేవేంద్రుతోడఁ
దెలుపు మని యెంత వేఁడినఁ దెలుపరైరె, వినివినమిచే సెనోకాని వేల్పుఱేఁడు. 61

క. మనగురు వఁట నేవచ్చుట, వినె నేమో గ్రుడ్డికంటి వేలుపుదొరతో
వినిపించి యతనియనుమతి, ననుఁ గొని చని సమ్ముఖమ్మున న్నిలుపుటయున్. 62

సీ. ననుఁ గని పాట నిల్పినతుంబురుని జూచి యాతఁడ మీసాది యనుచు మాటంచుఁ
గమలజోద్భవ సుమాళిము చెందినాఁడవు వింతవార్తలు గలవే యటంచు
నీతని నంపరాదే యంచు సన్నగాఁ దెల్పవారలను గద్దించుకొనుచుఁ
గ్రేఁగంటఁ బల్కు నుంకించు నన్నని పట్టుగద్దిగ లెస్సాయె గా యటంచు
సణ్ణ సేయక నిరుపమైశ్వర్యగర్వ, పటిమపవఁతులు జలకంబు పట్టియున్న
దనఁగఁ గట్టికవారింప్లకనిపికొంచు, యంచఱు నటుం మ్రమోయు నయ్యవసరమున.

గీ. మనగురుఁడు చేరి ననుఁ జూపి మనవి గాఁగ
నితని వీడ్కొల్పుఁ డన్న దేవేంద్రుఁ డొద్ద
నున్న గీష్పతిఁ గని కనుసన్న సేయ
నతఁడు నాదిక్కుఁ జూచి యనాదరమున. 64

క. ఏమోయి తాళకేతుం, డేమని పంపించె నిర్జరేంద్రుని కడకు
ద్దామక్షేమాహంతసాం, గ్రామికుఁ డాతనికి శుభమె కదయనిపలుకన్. 65

గీ. చఱచఱను జూచి దొరనిన్నుఁ జూచువాఁడు, నంతలోననె నీవు నన్నడుగువాఁడ
వాబలా పొట్టక్రొవ్వుగాకంచు నేను, గోత్రపరిపంథితోఁ గొంకుకొసరు లేక. 66

క. తారాపంథలు చక్కఁగ, వారనఁగా మెచ్చి దనుజవల్లభుఁడు నినుం

చేరుకొని వేఁడుమన్నాఁ, డారమణుల నొప్పగింపు మటుగాకున్నన్. 67

సీ. అలవాటు చేసికొమ్మఖిలమరుత్పాలకులఁ గూడికొని సిల్వాఁగొల్వాఁగను
నభ్యసింపఁగఁ జేయు మలజయంతునకు వేళ యెఱింగి వెండికాలాచి దాల్ప
దారికిఁ దెచ్చుకొమ్మారూఢిఁ బౌలోమి సైరంధ్రికా సదాచారమునకు
నలవడఁగా నేర్ప మచ్చరలకు మాఱునలుకలి బొనిసపాటులకును
దలఁపకమ్మృతంబు వైజయంతంబు మఱవు, విడువు వజ్రాయుధముతోడిగొడవ యింక
నిచటనుండక వెడలి రమ్మిపుడు చేన, పట్టనం చేను దోరణకట్టినాఁడ. 68

క. అని నీల్గు నన్నుఁ బస్పకఁ, గనుఁగొనలం గొస్పనిప్పుకలు కుప్పలుగాఁ
గనుఁగొను ప్రథమకకుప్పతిఁ, గని దేవగురుండు రోషకలుషితుఁడై 69

క. ఓరీ మీదొర గోరిన, తారారంధ్రలవిటావతంసులచేతన్
మీరజనీచరుఁ డగ్రజుఁ, జేరంజనుఁగాక యని వచించుచు నలుకన్. 70

గీ. వీని వెడలంగఁ ద్రోయుఁ డివ్వీటికోట, దాఁటునందాఁక ననుమాట నోటనుండ
నీటు వోమీటి గరువంబు మాటి యిటకుఁ, బెద్దపర్వాన వచ్చితి బెసరువుట్టి. 71

క. ధారాధరవాహను గ, ర్వారూఢియు గురుని శాప మటులుండెఁ గదా
మీరజనీచరుఁ డగ్రజుఁ, జేరం జనుగాక యనుటఁ జెందితి వగలన్. 72

క. పాతాళకేతుఁ డాధృష, దైతేయుఁడు వీఁడుఁ దమ్మదాలసకొఱకై
యే తెఱఁగున నేమయ్యెనొ, కో తెలియ దటంచుఁ దెలిసికొను నట్టియెడన్. 73

గీ. ఆరితేఱుటిల్లఁ గొందఱు చారవరులు, వచ్చి నతిసల్పి కువలయాశ్వక్షితీంద్రు
చేత నైనట్టి పాతాళకేతు పాటు, తోఁపఁ దెల్పినఁ దాళకేతుండు కనలి. 74

చ. ఒదవినశోక మాచికొని యుగ్రతరాగ్రహకేళికావశం
వదుఁడయి యింద్రు గెల్చుటకు వచ్చిననే మటుమీఁదఁగాదె నేఁ
డదయత నన్నరేంద్రుఁడు మదాలసకై కద భాసమానదో
ర్మదుని మదగ్రజుం బిలుకుమార్చెను దాని హరింతు నిత్తఱిన్. 75

గీ. కపటమునఁ దెత్తునాహంసగమన నదియె, ఱింగి మార్కొన్న నాతని భంగపఱతుఁ
బగయడంపక యున్న నీపగిది నెగులు, సైఁచవచ్చునె యిదియ నిశ్చయ మటంచు.

సీ. ఎదురిండ్లు ఫలుసాల లెనసివర్ణింపఁజాలిన మేలిపర్ణశాలికలు కొన్ని
యాగమాతంబుల యందలి యర్థము ప్రకటించు కీరశారికలుఁ గొన్ని
హవిరన్నసంభృతమద్విజకోలాహలాంకములైన యాగవాటములు కొన్ని
దున్ని విత్తక పుట్టి యెన్నఁ బ్రవేఁగున వ్రాలు నివ్వరి ప్రాలచేలు కొన్ని

తోఁపు లొకకొన్ని తెలినీటిదొనలు కొన్ని, కొలఁకు లొకకొన్ని పెంపుడుపులులుకొన్ని
మొవవు లొకకొన్ని చేమంతి పొదలుకొన్ని, బెరయఁగఁ దపోవనంబుఁ గల్పించి యపుడు

గీ. తోడిదైత్యులు శిష్యులై కూడి నడువఁ, బేరు ముండవ్యుఁ డనుచుఁ గల్పించుకొనుచు
గొన్నిమాయలు మదిలోన నెన్నికొనుచుఁ, గువలయాశ్వుని పట్టన క్షోణిఁజేరె. 78.

ఉ. అంతట పౌరసారసదళాక్షు లుదారవిహారసౌధయూ
ధాంతము లెక్కి కంటి రటవమ్మ మునీశ్వరుఁ డొక్కఁ డిమ్మహీ
కాంతునిఁ జేరి రాక్షసనికాయము చేత మదీయయజ్ఞమా
ద్యంతముఁ గోలు పోయితి నయా యని శోకనిపాతప్రచందముల్. 79.

ఉ. నిన్న 'గదమ్మ గాలవమునిప్రభు వెంబడి నేగి రక్కసు
న్వన్నియమార్చి రాచిలుకవంటి మదాలసఁ దెచ్చి యుద్వహా
భ్యున్నతిఁ గోరి నేఁటికి ముహూర్త మటంచును నిశ్చయించె నీ
యెన్నిక చిన్నవోవఁగ ఋషీశ్వరుఁ డెక్కడవచ్చె నక్కటా. 80

సీ. తలవాంచి బెళుకుఁ జూపులు క్రేళ్లుఱుక్కఁగఁ దెరమొఱంగుననిల్చు సొరపుఁజూచి
చెలికత్తె చేమెచ్చవలెనన్న సిగ్గుతోఁ దలఁబ్రాలుపోయు బిత్తరముఁ జూచి
వ్రేలిమిఁ జెమరించు కీలనంటెడు లాజ లందిచ్చునట్టి సోయగముఁ జూచి
కులదేవతకు మ్రొక్కు కొనువేళఁ దనపేరు పలుకఁ గొంకెడు ముద్దుబాగుఁ జూచి
ముచ్చటలు దీర్చుపూనిక వచ్చియితనిఁ, దోడుకొనిపోవుచున్నాఁడు దుడుకుఁదపసి
యతని మాటకు మారాడ నయ్యె యీతఁ, డిందుముఖి రాజులకు సౌఖ్యమేడదన్న

క. దార నయ్యెద నని [illegible], రరయఁగ జను లెవ్వరైన నాపెను బెడఁ ద
ల్పరికింపరు దారతనపు, న్సరవు ల్మతికత్తిమీఁది సాములు సుమ్మీ. 82

సీ. మంత్రుల మర్మకర్మము లెఱింగెడు దారి కోటలు కాపాడుకొనెడు నేర్పు
తటికాపు చెడకుండ సరిగోరుకొనుకీలు యీతిబాధలు చెందనీనిసొంపు
పరువుపాలోచన ల్పరికించు గరిమంబు నర్థార్జనము మీఁది యాదరంబు
వేఁటతోఁటలమీఁద వలసిల్లు నాసక్తి యొడ్డోలగం బుండు నొప్పిదంబు
తగిలిపిరువీఁకు సేయ నుద్దండవృత్తిఁ, జెలఁగుటయె కాని మనసు వచ్చినమిటారిఁ
గూడితమి మీఱ సయ్యాట లాడికొనుచు, నడువఁ గూడునె మేదినీనాయకులకు. 83

క. అని యాడికొనఁగ మాయా, ముని వెంబడిఁ గువలయాశ్వమున్నాకిరయం
బునఁ జని యారాకొనుసుఁడు, గనియెం బత్పర్ణశాలికాప్రాంగణమున్. 84

గీ. అంత నమ్మాయతపసి యయ్యతిథిసపర్యఁ, గమ్మవమ్ములఁ దుష్మెపదిన్నుఁదోలి

మన్మథపుఁ బుష్పశరల్ నెమ్మిఁ గుమ్మరించు, తెమ్మెరలు గ్రమ్మఁ గమలాకరమ్ముఁ జేర్చి

గీ. అధిప నీవిందు వచ్చిన యపుడె తొలఁగె, రక్కసులమాయ పద్మాకరంబునందు
వరుణజప మొనరించి యేనవ్వు వనుక, నిఘట సుందరంగ వలయు నీవేమి యనక. 85

గీ. అయ్య నినునమ్మఁ గూడ దేనరుగు దేరఁ, దామసంబైన జరగెన వేమొ నీవు
కాకయుండిన నిమ్ము నీకంఠహార, మిష్ట జన చిన్నినవ్వుతో నిచ్చుటయును. 86

క. జలదేవతకుం బ్రాంజలి, సలుపుము నక్కోలన మునిఁగి జనపతినగర
స్థలమున నంపిపురంబున, నలరం బోవ చెంత డిగ్గియుండేలుటయున్. 87

గీ. కుండలియుఁ దానునవ్వుచుఁ గూడియున్న, యమ్మదాలసఁ గని మంత్రియంప మొంది
యమ్మనుజరాజు పూని మూగమ్ముగా చె, రక్కసులఁ దోలి భుజబలప్రాభవమున. 88

ఉ. అమ్ముని యంత సంతసము నంది యభిందితకార్యధుర్యు రూ
ఢమ్ముగ నీవివాహముచటుం జరగింపఁగఁ గోర్కె వేడ్క యీ
యిమ్మువఁ బట్టనంబు రచియించెప నాదు తపోబలంబునం
గొమ్మను బిల్వ బంపు మిటకు న్మఱుమాటలు పల్కకేమియున్. 89

గీ. అనిన మాటాడ వెఱచి యమ్మనుజనాథుఁ, డానవాలుగ నీకంఠహార మిచ్చి
నిన్ను వేవేగఁ దోడి తెమ్మన్న నచ్చి, నాఁడ రావమ్మ కుండలతోడఁ గూడి. 90

మ. అనియా మౌక్తికహార మిచ్చుటయుఁ సాంద్రానందమున్ బొంది మా
నిని మేకోలునఁ గుండలానపనము న్వీక్షింప నయ్యంబుజా
నన కానిమ్మని పల్కఁ గృత్రిమవిమానం బెక్కఁగాఁ జేసి య
ద్దనుజాధీశుఁడు తా నదృశ్యుఁడయి చెంతం బోయె సంతుష్టుఁడై 91

వ. అత్తఱిం బటికత్తరుణభానువిరాజమానం బగు నమ్మాయావిమానంబు జలయంత్రంబును పమఁ బ్రవేశంబునకుం గమకించు నంపకంబు రకంబునఁ బోవుగా నగిరి యొక్క పరిరథంబు విధంబున మంపగతిం జనుచు నొక్కసారి లకోరిధారి రివ్వున నిగుడు చు నొక్కతేప బొంగరంబు రంగున బిఱబిఱం దిరుగుచు నొక్కమాఱు గాలిప టంబునీటున నసియాడుచు నొక్కయెడఁ జుక్క తెగిపడ్డ విధంబున డిగ్గుచు నొ క్కచోటం బుట్టచెండు వడువున నుప్పరంబునకుం బోవుచు నొక్కవంక జీనుది గవైచిన కప్పలి చొప్పునఁ గదలక నిల్చుచు నొక్కపరి బైరిడేగ యొయ్యారంబునం ది ర్యక్ప్రచారంబుఁ జూపుచుఁ బోయి మేరుధారుణీధరంబున నిబిడాంధకారబంధు రం బగు నొక్క బిలంబున దమాలతాలతక్కోలరసాలసాల ముఖసాలవిశాలం బగు వనంబునం బునఃపునర్వర్ధమాన గిరిఝుకీవితానంబులకు నుబ్బు గన్పించు పన్నిటిపిల్ల

కాలువలవలం బ్రోదిసేయు జాదివిరిదేనియవాక వెంబడిం బోవుకొనిన పోఁకఁబ్రాకు
ల కట్టకడపట నెట్టుకొనిన యిందుకాంత వేదికాబంధంబులతోడి గురివిందపందిళ్ళ
నొరసికొనియున్న తిన్నని మాగిపోతివన్నియలఁ జెన్నగు చవికల నమూడుకొన్న క
న్నెసుపపొన్నగున్నలఁ బెనఁగొన్న నతిబియ్యపు జాతికి నాధారంబగు గొప్పకెంపులు
బ్బ చప్పరంబులం గప్పికొన గుజ్జుమామిడుల క్రేవలఁ దమ్మితావులకుం దావులైన తెలి
నీటి కేళాకూళినంటికొనిన యానంటులవలనం దొరఁగు కప్పురంపు రసలుం బాఱు
కాలువకూటంబు డిగ్గిచను మెట్లవగ్గలి నగ్గలంబగు నీలంబు నిగ్గులు గగ్గోలుపడు కో
నపాదిరింగాఁ గిలించిన పొగడగుంపుల నట్టనడుమఁ బట్టుగఁ పొదరిండ్లఁ జుట్టుఁబ
డియున్న బిత్తరం బగు క్రొత్తముత్తియంపుఁ బడుకటింట నపరంజి నోలుసులం జెలం
గు తూఁగుటుయ్యెలచేరువనుం జని యప్పద్మనుజపతియందు నిజాకారంబుతో నయ్యుద్ద
అం దస్తగ్రహంబున నుంచియాతిఘోరాకారలగు దైతేయభామలం గాపువెట్టి కృతో
కృత్యసంగాఁ దలంచుకొని యాక్షణంబున. 92

చ. మునుపటిపారికాంక్షి వినయుం భజియించుచునంబుజాకర
బునఁ బడి తేలి యోనృపతిపుంగవ నీభుజసారగౌరవం
బున జపమెల్లఁ దీఱెఁ బొలివోవక నీవిఁకఁ బట్టనస్థలం
బునకయి పొమ్ము రాజునకుఁ బోలునె యాశ్రమవాసఖిన్నతల్. 93

చ. అని యనుపన్ హసాపని నృపాగ్రణి యమ్మునిలోకచంద్రు వీ
డ్కొని తన తేజి నెక్కి గిరికోటులుఁ గాననవాటులు న్మహా
జనపదము ల్నదంబులును జయ్యనదాఁటి పురంబుఁ జేరి కాం
చనసముదార మై తగుహజారమునం దమవారు చేరఁగన్. 94

క. తురగంబుడిగ్గి యచ్చటి, పరిజనుల న్వీడుకొల్పి పార్థివచంద్రుం
డరిఁగి గృహాంతరమునఁ ద, త్తరుణీమణి లేమి నగ్భుతసమగ్నుం డై. 95

ఉ. అక్కట యెందుఁబోయెనో యయారపు సంచులముద్దుగుమ్మ యే
చక్కని దాఁగెనో కలికి చక్కనలెక్కనగుబ్బలాడి యే
దిక్కననున్న దోసొలపు దేఱెడిచూపుల భామ కారి యే
యిక్కనిల్చెనో యొరపు నీనెడు చిల్కలకొల్కి డైమా. 96

ఉ. ఆనవ లామెఱుంగుఁదొడ లాకటిగంటన మాచుసోయగం
బానెరు లామిటారిబెరు లాముదిపంబునఁ బల్కుపాటనం
బానోస లావెనంబునస లా తెలిపయ్యెదచక్కఁ జేర్చుపాం

పేనలినాక్షికైనఁ గలదే కలరే యిటువంటి కామినుల్. 97

సీ. గిలుకుబంగరుమట్టియలు జాఱఁగాఁ జక్కనలవరించెద నంచునిలిచినిలిచి
బయట నున్నది చిల్కపంజరమున నుంచి మఱివచ్చెద నటంచు మరలి మరలి
యతివ యల్లపుడేమి యంటివే యేచిరాకయియుంటిఁ దెల్పుమం చడిగి యడిగి
చెమటచేఁ దిలకంబు చెదరెనో యని వింతసొలపుతో నద్దంబు చూచి చూచి
ప్రొద్దు గడపుట కని తోడి పూవుఁబోఁడు, లపరనై నంగఁ దనమాపయానగరిమ
యినుమడింప మదీయమోహనగృహంబుఁ, జేరు టెన్నఁడొ యానీలచికుర నికర. 98

శా. కైజాచేసినబొండుమల్లె విరిబ్ఘ్యాగడాజగాజోదు తే
జీజాతం దలవాంచి బోఁటిచెలఁగుం జేఁగట్టిగాఁ జట్టి ను
న్గాజుం గంబము చాఁటున న్నిలిచి క్రేఁగంట న్ననుంజూచు నం
భోజాతాక్షిని సెజ్జకుం దిగుచునేర్పు ల్గల్గునే మీఁదటన్. 99

క. ఎక్కడి యాలోచన యిది, యక్కట యక్కలికి యున్నయప్పటికిఁ గదా
యిక్కోరికియని నవి, ల్మొక్కలిదొరవిరిలకోరి మొనకుం దలఁకున్. 100

సీ. పొడఁగనవచ్చు నాప్తులవేళఁ గాపంచు నవసరంబులవార లడ్డగింపఁ
బనిగల్గియుండినఁ దనకు మంత్రులకు లేఁజిగురుఁ బోఁడులచేతఁ జీట్లు నడున
నిదియేమొ కడువింత గదయంచు నవరోధ బిసరుహాక్షులు గుసగుసలువోవఁ
గొలువుకూటమునందుఁ జెలఁగెడు సింగంపుగద్దియగవిసెన గైకొనంగ
బొక్కసంబులు పెనుబీగములు భజింప, నుపీగములవారలకు నాటవిడుపు గాఁగ
నోలమును మాని మేదినీయువతిజాని, యింతి భావించు నంతఃపురాంతరమున. 101

క. ఈకరణి నన్నృపాగ్రణి, యేకరణీయములు మాని హిమకరవిలస
ద్రాకలకు న్వలిదమ్మెర, రాకలకుం జాలిగొని విరాళిఁ బడంగన్. 102

ఉ. ఆతని నేస్తగాండ్రు భుజగాత్మజు లవ్వగ లెల్లఁ గాంచి య
య్యో తమవంటివార లిటు లుండియు నీదొర నీ దురంతచిం
తాతను తానితాంతహృదయవ్యథఁ గూఱఁగ నూరకున్న సం
గాతులమౌదుమే యిపుడుగాక మఱెప్పటికీ వయస్యతల్. 103

క. అని యయ్యిద్దఱుఁ జని తమ, జనకుం డగునశ్వతరుని సమ్ముఖమున న
జ్జనపాలువిరహవేదన, వినిపించి తదార్తిఁ మాన్పవే యని వేఁడన్. 104

చ. తనయులస్నేహబాంధవవిధానము లెంచి నరేంద్రుఁ డంటిమా
ఘునుఁ డటువంటివాని కుపకార మొనర్చినఁ గీర్తి చెందదే

యని రజతాద్రికిం జని నగాత్మజతోఁ జదరంగ మాడు రు
ద్రుని గని మ్రొక్కి కుండలివరుం డటు నిల్చిన నావరంబునన్. 105

గీ. అంబికయును నితం డెవ్వఁ డనుచు నడిగి, యధిపుఁ డశ్వతరుండు గాఁడా యటన్న
నీతఁడా యశ్వతరుఁడు సంగీతవిద్య, దొడ్డవాఁడఁట యనిన రుద్రుండు చెలఁగి.

క. వెనుకం బురుహూతు దెసం, దనతంబురవలన గెలిచె నానాగతుల
న్మునితుంబురు నీవెన్నఁడు, వినవంబురుహాక్షి నేఁడు విను మనిపలుకన్. 107

గీ. మంచిది సగటుపై నిదె మంత్రికాన, లున్నదీచదరంగ మిట్లుండనిమ్ము
వెనుక నాడుదమని సతి వనజనయన, యభిముఖంబుగఁ గూర్చున్న యవసరమున. 108

గీ. ఔర నారాక ఫలియించె నంచు నెంచి, యచటఁ గూర్చుండి యయ్యురగాధినేత
గవిసెన సడల్చి తంబుర కలికి పైఁడి, బిరడలు బిగించి శ్రుతులెల్ల సరిగఁ గూర్చి. 109

క. రాకాశశాంకవదన వ, రాకా యిటు నీవు మ్రోల రహి గనిపింపన్
నాకుఁ బరమానె యైనం, గాకుండిన నీకు ముద్దు గద యని యంతన్. 110

సీ. శ్రుతి తోడఁ గూడి మెచ్చులు రాజసంబుగ సంచునందగ నాలపించుసొంపు
గతియుక్తమైనను గుక్కవిడుచక హొయలుగా నవరసంబుగఁ బాడు నెడ నేర్పు
పరరాగముల వింత సొరనీక వ్యాప్తిమై మించుగా రాగంబుఁ బెంచు వింత
తాళంబు తప్పక తనువు గదల్పక బాగుమీర పదంబు పాడుదారి
ఎడనెడఁ బరాకు వినుమను హెచ్చరింపు, మీరు మెచ్చిన యీవిద్య మీకొసంగు
నట్టిదని గర్వపరిహాస ములర నతఁడు, గాణ వవుసనసుఘమార్గము నటించె. 111

గీ. గోఁటి వాద్యంబు కిన్నరమీటు బడ్డి, వాద్యము రబాబు వగలుసద్వంబు మెరయ
దురుసుగతి జూపఁ బార్వతీతరుణి మెచ్చి, జాఱు సరిగంచు పయ్యంటఁ జక్కఁ జేర్చి

ఉ. ఎక్కడి నారదుండు మఱి యెక్కడి తుంబురుఁ డోగిరీశ యే
దిక్కునసైన నీవిధము తేటపడం గనుఁగొంటలేద యే
పెక్కువ తప్పకుండఁ గనిపెట్టుక యుండితి మొందుఁ గానమ
మ్మక్కుశబోసు మేలు హవుసంసు ఫణీశ్వరుఁ జూచి యింపునన్. 113

క. వరమడుగుమనిన గంగా, సరసిజముఖి యీసుతోడి జంకెనచూపుల్
బొరసిన మొగంబుఁ ద్రిప్పెం, గిరిజను డెందమున వింత కినుకజనింపన్. 114

ఉ. అమ్మక చెల్లఁ డెన్ని వగలద్దిరనాయకుఁ డొద్ద నుండఁగా
ఖైమ్మెలు గాక యేను వరమిచ్చెదనంటి విదేటిమాట దో
సమ్మసుమీ నగుఁబాటులకు నవ్వని నాగసభాజ్ఞలేక యే

కొమ్మని యోఁగఁ జెల్లునె యకుంఠిత చాతురి గల్గియుండినన్. 115

గీ. అని పలుక నెంత లేదామృగాక్షిమాట, వినక మదుగుము పరమిత్తు విభుఁడుతనకు
నంతచనువిచ్చినాఁడన నవ్వఘాటిఁ, జూఱుకు చుఱుకునఁ బార్వతిఁజూచెనపుడు. 116

చ. ఉరగవిభుండు లేచి కుధరోద్భవఁ గన్గొని యమ్మ మేదినీ
వరుఁడు ఋతధ్వజుండు భుజవైభవశాలి మదాలసాసతిం
బరిణయమాడునంచు నిజమందిరమం దిరవొంపఁ జేసి త
త్తరుణి వయస్యఁ గుండల వితావితఁ గావక వంతఁ గుందెడున్. 117

గీ. వారి నిప్డరి రప్పింపవలయు ననిన, గిరిజ, కానిమ్మనంగఁ దత్సరసిజాక్షి
కాని కుండల రాపంచు గంగ పలుక, నభవుడిద్దరియందు మధ్యస్థుఁడగుచు. 118

గీ. మంచిదహిరాజ రెండునాళ్ళించుమించు, గాఁగఁ గుండల చనుదెంచు గాకయిప్పు
డమ్మదాలస వచ్చు నీవలుగుమనిన, నదియపదివేలుగా నెంచి యాతఁడటఁ గె. 119

ఉ. అంతటి లోననే యలమదాలస నిద్దురవోవ నయ్యుమా
కాంతుఁడు మాయచే నురగ కన్యాగృహంబున గల్పనాతఁ డ
త్యంతముసంతసించి తనయాత్మజగా నురరీకరించి య
య్యింతిని గొల్వ వెవురు మృగేక్షణల న్నియమించి యత్తరిన్. 120

చ, తనయులఁ బిల్చి మీరు వనితామణి వచ్చిన మాటఁ దెల్పక
జనపతిఁ దోడి తెండనఁ బ్రసాదమటంచును వారలేగి గ్ర
క్కున నడిగంపుఁ జేడియలు కొందఱు గొల్వఁగ నున్న భూవరుం
గనిన నతండు నిండు కుతుకంబునఁ జేరువ నుంచి యిట్లనున్. 121

ఉ. ఇన్ని దినంబు లంబుజవనీశుఁడు చెంబొనయిండ్లలోన ర
క్కున్న మదాళిఁ బద్మగృహకోటికిఁ బొమ్మని తీవరించు నం
తన్నుఁ జేరవత్తురుగదా యొక యామము బోవుదాక రా
కున్న తెఱంగు మాకు విన యోగ్యము యేని వచింపుఁ డింపుగన్. 122

క. పరబల ఖండన మంత్రా, చరణము గృహకృత్యగత విచారము కాకో
పరపుత్రులార మీ, రిట కరుదేరక యుండ నాఁగినది యెయ్యదియో. 123

చ. అనుడు భుజంగరాజ సుతు లట్టివి యేవియులేవు లెండు మా
జనకుఁడు మీగుణంబువిని సంతసమంది మిముం గనుంగొనన్
మనమునఁ గోరి తాన పయనంబయినన్ వలదా యిలాబలా
రిసఁ దోడిఁ దెత్తునంచు వివరించుటకై తడవుంటి మిత్తరిన్. 124

క. ఆతీసునఁ బలుకఁగరా, దోతెలియదు గాని శౌర్యధూర్వహసీసం
గాతముచే నీమన్ననఁ జేతం దొడితేరఁ బ్రతినఁ జేసితిమనుఁ డున్. 125

క. మాయురె తా రానలెనా, యాయెడకే నరుగుదెంతు నాయిల్లనఁగా
నీ యిల్లనగా వేఱా, వోయఁగ రా విట్టులైన భువి సఖ్యంబుల్. 126

మ. అనుచుం గట్టికయింతి దేవర పరాకయ్యా పరాకంచు బో
రన మ్రోయన్ వలెవాటుకుప్పటి చెరం గల్లాడఁగాఁ జేఁగటా
రిని లోభాగము నూఁది నిల్పఁదగు వారి న్నిల్పుచున్ మేలికం
దనపుం గద్దియ డిగ్గి నిల్చె నురగేంద్రవక్షో దివ్యక్షోరతిన్. 127

చ. నిలచి పరావనీప రథి నీరథి మంథనమందరాద్రి య
బ్బలి యొఁడోకంఠ పాప దొరపట్టులు తెన్నెఱిఁగించుచుండఁగా
నలరుచుఁ నేఁగి కాంచె సికతాంచితతీరసమేతకేతకీ
తిలకగ చంచరీక సుదతీ కృత గీతిక గోమతీనదిన్. 128

చ. కనుఁ గొని చిల్వరాచకవ గ్రక్కున నన్నదిఁ గ్రుంకఁ జేసి తో
డ్కొని చనఁ నేఁగి చూచె ఫణకోటి మణీఘృణి వేణి కోర్థవ దీ
పనికర భూత్రపాచరిత శౌణ్డకేళి విధూత రత్నరు
గ్జనిత నవస్మితానన భుజంగిక మొక్కపురంబు ముందరన్. 129

చ. అచటి వియోగిభోగి జలజాక్షులు మారుని వ్రాసి కొల్చునో
నచలితభక్తిఁ జందురని యందమెఱుంగమి మున్ వసుంధరా
రుచి గరుణావలోకులు వరుల్ చెలి నీ మొక మబ్జునంటివన్
వచనము లంతలోఁ దలఁచి వ్రాయుదు రున్మకురాగ్ర వీక్షులై. 130

క. ఈకరణిఁ జూచి డిగు నా, భూకాంతున కొక్కయింపుఁ బొడమించెను ద
ర్వీకర నైశాకర రు, చ్యాకర ముక్తానుషక్త హర్మ్యతలంబుల్. 131

సీ. తీవయుయ్యెల లూఁగు పూవు బోఁడులవీఁగు కొప్పుచీఁకఁటిఁ డాఁగు కోర్కి యొకటి
నును పుట్ట చెండాడు వనితల యరవీడు జిలుగుపయ్యెదఁ గూడు చెలువ మొకటి
యలయంచ నడలించు చెలుల జంకెనమించు బెళుకుచూపులముంచు బెరికి యొకటి
పూవుబంతులు దువ్వ పొలతుల తెలినవ్వ కలికి వెన్నెల క్రొవ్వగనుట యొకటి
గాని మఱియేమి వలదని కంకణంబు, గట్టుకొని సల్పుపతి దృష్టి గ్రమ్మరించి
చలిదిగట్టించి త్రిప్పె నిస్తుల సువస్తు, నవ్యసంతోషకరమగు నాగపురము. 132

ఉ. ఇట్టులఁ జూచుచుం జను నరేశకు శేషయబాణు చూడ్కి న

న్నిటమగుడించె భోగిపరిణీ తరుణీ ఫణ ధోరణీ నవా
ఘటిత మణీగణీభవపకంప ఘృణీత వియత్ప్రశంగ మో
త్కట ఝరిణీ సరోజ మతికారి నమేరు వహీర మారుతుల్. 133

క. ఆవ్వనముఁ జేరి మున్నవు, జవ్వనవున్ రాచకొమరుఁ జల్లనిపుంపుం
దువ్వరల నివ్వటిల్లెడు, పువ్వుంబొదరింట నునుచి భుజగ కుమారుల్. 134

క. ఇట నుండు మేము నీవ, చ్చట యురగేంద్రునకుఁ జెల్పి శోభనలీలా.
ఘటనాపూర్వంబుగ ని, చ్చటికే తెంచెద మటంచుఁ జనుటయు నతఁడున్. 135

మ. వెలుఁగు గ్గాఁపగు మిన్నతీవియల కీవిన్ రాయు పన్నీటికా
ల్వల తుంపుర్లకు మారు గాఁబలెఁ జలద్వాసంతికా నూన ని
ర్మల మారంపకణాళి జారి తనపై వ్రాలంగ రాయంచ లె
క్కలు ఝాడించినఁ గ్రమ్మ తెమ్మెరల రాకన్ హాయి మంచున్నెడన్. 136

చ. హడపము వీణ కిన్నెర హిమాంబువు నించిన గిండి చల్వపా
వడలుఁ గురంగనాభియు జవాదియుఁ దట్టుపునుంగు వీవనల్
ముడి విరు లద్దముల్ సురటులుం దెలిపంతపు దివ్వెల్ ముదం
బడర ధరించి యాడిగపు టబ్బురపున్ వలిగుబ్బెతల్ దగన్. 137

సీ. జిగిచాలు దగుకీలు చిగురాకునకు బ్రాఁకు కలికికోయిలలకుఁ గొలు పనుప
నెలగోవగలమోము తెలిపమ్మిఁగల తుమ్మెదలకు నమ్మిక కమ్ములలవరింప
నెఱికప్పఁగను కొప్పుఁ నెరిమబ్బునకు నుబ్బు నెమలికిఁ ద్రోవబత్యములననుప
నునుమోవిపైకీవి మునుబింబ నికురుంబములకేఁగు రాచిల్క కొళ్ళవులియ్య
లెనగవు డాలు కైదండ పూనుచూపు, తళుకుచే మ్రొక్కఁగొనెడు ముత్యాలరెట్ట
పేట పాపటబొట్టు తుంపిళ్ళు గుఱియ, నచటికే తెంచె నొకచకోరాయతాక్షి. 138

సీ. కావలిఁగనునింతి కానుకిచ్చినబంతిఁ గనుసన్న నొకకన్నె గైకొనంగ
దెలిచూపు గమి తారసిలుచు నిల్చిన యంతఁ బడతులిద్దరు బరాబరులు సేయ
నగుమోము జిగితమ్మి నిగుడు ఘర్మము గ్రమ్మి నంతుకై చెలువపావడలు దుడువ
తొలఁగు బంగరురంగు జిలుగు పయ్యెద కొంగు సకియ యొక్కతె చక్కసవదరింప
కట్టిక మిటారి మొకరి చెల్కత్తెగములఁ, బొడఁగనఁగఁ జేయు బంగారుపొంతె మొలుఁగు
టరిగె గుంపుల నీడ నొయ్యారమొసఁగ, వచ్చి పుష్పాపచయకేళివాంఛ దేలి. 139

క. మడమఁబడు నిడుపవాలిక, జడ నడుమున జుట్టిపైట సరిగె చెరంగుల్
బెడఁగుఁ జనుదోయి పొడ లే, ర్పడ బిగియింపుచు ననుంగుఁ బడతులుగొల్వన్. 140

చ. చిలుకలలోన చిక్కులయి చెల్వపుటంచుల లోననంచలై
తెలివిపొసంగు తీపియలఁ దీవియలై సరసంపుఁ బల్కులన్
గులుకునెడల్ పసిండి తలుకుల్ గలమేనులు గానుపింపఁ జే
తుల కసివోవఁ దేనియలతో ననతోయములెల్ల గిల్లుచున్. 141

సీ. కలిగొట్టుఁ జేరబో కళి గొట్టు సేయునీ బీరమేమిటికి జంబీరమదిగో
సిందువారము తెసె సింధు వారము లేని పైరుగాఁ దేఁటి కింపై రుచించుఁ
జూతము పదరమ్ము చూతము మదవతీగానంబు లచ్చోట గానరావె
రమ్ము మారుని గుడారమ్ము మారు నిజమ్ము గుంపు నోటుల గుజిగుంపు లేల
యీరమా యీరమానీతి యీప్రసూన, వాసనల్ వాసనల్ వంకనందికొనఁగ
పాటలాపాటలాళిచేపడియె ననుచు మాటకే మాటకేమి లేమావి విరులు. 142

క. అని జవ్వను లవ్వానిఁ గ్రొ, వ్వునఁ బువ్వులు గోసి కడు దవులొల్కను నవ్వుల్
నన రువ్వులు కొంపరు మెచ్చని చివ్వలు నివ్వటిల్లఁ జని యవ్వలనన్. 143

సీ. కంబముల్ గాన నిల్కడఁ గన్న పోఁక బోదియలపై నడిగాగ డీటుకొన్న
యలదీన చాలు వాకిలి సొచ్చి లేమావి గుమురుల క్రీనీడఁ గొప్ప కెంపు
లలితంపు మెట్లఁ గేళాకూళికవ్వల జలయంత్రములవీఁగు దలుపగొప్ప
గదియంగఁ గలువ మేల్కట్టు పూవుల గప్పు సాంబ్రాణి ధూపంపుజలపసాళి
వరసిఁ బురివిప్పఁ జను నెమ్మి నాస గలుగు, దాని గాఁజేసికొనెడి చిత్తరువు బొమ్మ
చిలువ చెలువంపు జడ గుంపు సొలపు నింప, నీడగాననియొకచిన్ని మేఁడమీఁద.

క. చెలువైన పసిడిగద్దియఁ, గొలువై నలువంకఁ జెలువ గుంపులుగొలువన్.
బలువై ఖరి పావడ నెల, తలు నైవఁగఁ గన్నెయున్న తఱినటమున్నన్. 145

శా. ఆజన్మస్థిర ధర్మకర్మ నిపుణుం, డౌరాజు రాచిల్కమే
త్రైజీ జోత్సేదాక పాంతకాఁడయి తనుం ద్రిప్పంగ నయ్యాంతి య
య్యోజన్ వచ్చుట గొలెఁ బూపొదలలో నున్నట్లువీక్షించి యా
రాజీవేక్షణ వెంటనంటఁ జని గారామార సౌధస్థలిన్. 146

క. వలభిన్మణిగణగుంభిత, వలభిం దద్రుచి తమంబు వలఁగొని పొదువన్
జలదాచ్ఛాదితుఁడగుత, మ్మలదాయ యనంగ నిలిచి ముదితం జూడన్. 147

శా. ఏకైకాంగవిలోకనాకల నతుష్టైకాంత సామంత భా
వాకూతంబులు తద్విధాత్మరచనా త్యాశ్చర్య గాఢాప్త మూ
ర్ధాకంపంబులుఁ దత్సమానకృతి మానాధీన నానావచ

